బాలానంద బొమ్మల

# రెండు మహానగరాల కథ

(A TALES OF TWIN CITIES)



మూలం :

చార్లెస్ డికెన్స్

స్వేచ్ఛానుసరణ :

సింగంపల్లి అప్పారావు





నవరత్న బుక్ హౌస్

కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-520002.

బాలానంద బొమ్మల రెండు మహానగరాల కథ

ర చ న :

సింగంపల్లి అప్పారావు

ప్రథమ ముద్రణ :

నవంబర్ 2000



ముఖచిత్రం :

రవి

లోపలి బొమ్మలు :

వి.యస్. ప్రకాష్



28-22-20, రహిమాన్ వీధి

అరండల్ పేట, విజయవాడ-2

ఫోన్ : 432 813

ముద్రణ :

డి. బి. ప్రింటర్స్

విజయవాడ-2

వెల : రు. 25-00

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్పియర్ అద్భుత కథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు
" పంచ తంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాండ్య కట్టబ్రహ్మన

బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" ఆలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" భేతాళ కథల్లు
" తెనాలి రామకృష్ణ కథల్లు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథల్లు(2భాగాలు)
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" అజాద్ చంద్రశేఖర్
" రాజా రామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజీ
" భగవతీచరణ్

## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
శాప్లీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని

తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

# రెండు మహానగరాల కథ!

అది 1775వ సంవత్సరం!.... ప్రపంచంలో అతిపెద్ద రాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్స్‌లలో అట్టడుగు వర్గాల ప్రజలు పేదరికంతో అకలిబాధలతో అలమటిస్తూ రాచరికపు ప్రభువులమీద ధ్వజమెత్తి విప్లవశంఖం పూరించాలని భావిస్తున్న గడ్డు కాలమది!....

ఇంగ్లండ్ రాజు తన రాజ్యంలోని పేద ప్రజల బాధలను చూడకుండా, వాళ్ళ సమస్యలను పరిష్కరించకుండా నిర్లక్ష్యం చేస్తూ ఎక్కడో అమెరికాలో వున్న తన వలస ప్రాంతాల ప్రజల సమస్యలను పరిష్కరించడంలో ఎక్కువ శ్రద్ధ చూపుతూ ఉండేవాడు.

ఇక ఫ్రాన్సు దేశాన్ని పాలించే రాజు కూడా కులీనులు, అమిత ధన వంతులు, రాజవంశీయులు అయిన ప్రభువులు సమకూర్చే విలాసాలలో మునిగి తేలుతూ బడుగు వర్గాలవారి బాధలను పట్టించుకునేవాడు కాదు. అతడి దృష్టిలో ప్రజలు చీమలూ, దోమలుగా కనిపించేవారు.

అందువలన ఫ్రాన్సుదేశంలోని పేద ప్రజలకు రాజుమీదా కులీనులైన ధనవంతుల మీదా రాజవంశీయుల మీదా అసహ్య భావం ఏర్పడింది. రాజు మీద ఎవరికీ భక్తి భావం లేకుండా పోయింది. ప్రజలంతా విప్లవం మీద మొగ్గు చూపడం ప్రారంభించారు.

రెండు దేశాలలోని పరిస్థితులు విప్లవం అంచుల వరకూ చేరుకున్నాయి. ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరూ చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. ధనవంతులు, రాజ వంశీయులు ఎప్పుడు ప్రజలు తిరుగుబాటు జరుపుతారోనని భయపడసాగేరు.

రెండు దేశాల ముఖ్య నగరాలైన లండన్, పారిస్‌లలో చట్టం, న్యాయం మచ్చుకైనా కనిపించకుండా పోయాయి. దొంగలు విచ్చలవిడిగా తిరగడం ప్రారంభించారు. రాత్రివేళ దొంగతనాలు, హత్యలు, సర్వసాధారణమైపోయాయి. అడిగే నాథుడు లేడు. వాటిని అరికట్టే న్యాయవ్యవస్థ లేదు.



లండన్ నుండి పారిస్ వెళుతున్న గుర్రపు బండిని వెనుక నుండి గుర్రపు రౌతు ఒకడు వేగంగా వస్తూ చేయెత్తి పిలుచుట!

ఒకచోట నుండి మరొకచోటికి ప్రయాణం చేసే ప్రయాణీకుల ధన, మాన, ప్రాణాలకు భద్రత ఉండేది కాదు.

ఇదీ ఆనాటి రెండు మహానగరాలలోని ఘోరమైన పరిస్థితి!—

## 2

అవి శీతాకాలపు రోజులు. మంచుపొగ దట్టంగా అలుముకున్న ఆ రాత్రి ప్రయాణీకులను తీసుకుని ఓ గుర్రపు బండి లండన్ నగరం నుండి 'డోవర్' పట్టణానికి బయలుదేరింది.

ఆ బండిలో ముగ్గురు ప్రయాణీకులు ఉన్నారు. బండితోలేవాడు గుర్రాలను అదిలిస్తూ బండిని వేగంగా పోనిస్తున్నాడు. గమ్యం చేరేవరకూ తమ ప్రాణాలకు భద్రత లేదని తెలిసిన ప్రయాణీకులు ప్రాణాలు అరచేత బెట్టుకుని కూర్చున్నారు.

అంతలో బండి వెనుకగా ఎవరో వస్తున్నట్టు గుర్రపు డెక్కల చప్పుడు ప్రయాణీకులకు వినిపించింది. ఆ తెల్లని పొగమంచులో కూడా మార్గం వెంట గుర్రపుబండి వేగంగా పోతూనే ఉంది.

కొంత దూరం వెళ్ళిన తర్వాత గుర్రపు బండి మార్గానికి మార్గానికి ఒక ప్రక్కగా ఆగింది. బండివాడు బండిని దేనికి ఆపాడో ప్రయాణీకులకు అర్థంకాలేదు.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో గుర్రపు డెక్కల చప్పుడు స్పష్టంగా వినిపిస్తూ సమీపానికి రాసాగింది.

బండివాడు పిస్టల్ పైకితీసి వస్తున్న గుర్రపు రౌతుకు గురిపెట్టి "అక్కడే ఆగు! అడుగు ముందుకు వేసావో కాల్చిపారేస్తాను." అన్నాడు బిగ్గరగా.

గుర్రపు రౌతు బండికి కొద్దిదూరంలో ఆగి "నీ బండిలో ప్రయాణం చేస్తున్న వ్యక్తికి ఓ ముఖ్యమైన వార్త అందజేయాలి. అతడి పేరు జార్విస్‌లారీ." అన్నాడు.

ఆ పేరుగల వ్యక్తి బండి కిటికీలోనుంచి తల బైటికి పెట్టి "ఆ మాట్లాడేది 'జెర్రీ' యేనా? ఇంతకీ ఏమిటి విషయం?" అని ప్రశ్నించాడు.

"అవును! నేను జెర్రీనే! జెర్రీ క్రంచర్! టెల్‌సన్‌వద్ద నుండి మీకొక వార్త తెచ్చాను." అన్నాడు గుర్రపు రౌతు.

"భయపడవలసింది ఏదీ లేదు. అతడు నాకు బాగా కావలసినవాడే నేను లండన్‌లోవున్న టెల్‌సన్ బ్యాంక్‌కు సంబంధించిన వాడిని!" అన్నాడు మిస్టర్ లారీ.

తర్వాత గుర్రపురౌతు బండివద్ద కొచ్చి ఓ కాగితాన్ని మిస్టర్‌లారీకి యిచ్చాడు.

మిస్టర్‌లారీ కాగితాన్ని విప్పి "డోవర్‌వద్ద మేడమ్ కోసం ఎదురుచూడు!" అని వున్నమాటలను బిగ్గరగా చదివాడు.

మిస్టర్‌లారీ గుర్రపు రౌతుతో "చూడు జెర్రీ!.... 'తిరిగి జీవిత మార్గానికి మళ్ళింపబడెను.' ఈ మాటలు నా జవాబుగా వాళ్ళకు అందజెయ్!" అని చెప్పాడు.

ఆ మాటల అర్థమేమిటో జెర్రీక్రంచర్‌కు అర్థం కాలేదు.

బండి తిరిగి బయలుదేరింది! బండిలో కూర్చున్న ప్రయాణీకులు నిద్ర మత్తుతో అటు యిటు ఊగుతున్నారు.

ఆ నిద్రలో మిస్టర్‌లారీకి ఓ కల వచ్చింది.

ఆ కలలో మిస్టర్‌లారీ ఒక సమాధిని తవ్వుతున్నాడు. ఆ సమాధిలో వృద్ధుడొకడు పీకలవరకూ మట్టిలో కూరుకుపోయి వున్నాడు. ఆ వృద్ధుడ్ని పైకి తెచ్చేందుకు మిస్టర్‌లారీ యింకా సమాధిని తవ్వుతూనే వున్నాడు. వృద్ధుడు కొంత పైకి వచ్చిన తర్వాత ఊపిరి పీల్చుకున్నాడు.

'నిన్ను యీ సమాధిలో పూడ్చి పెట్టి ఎంతకాలమైంది?' మిస్టర్‌లారీ వృద్ధుడ్ని ప్రశ్నించాడు.

'దాదాపు పద్దెనిమిది సంవత్సరాలు!' వృద్ధుడు జవాబు చెప్పాడు.

"నువ్వు తిరిగి జీవితమార్గానికి మళ్ళింపబడ్డావన్న విషయం నీకు తెలుసా?" మిస్టర్ లారీ ప్రశ్నించాడు.

'వాళ్ళు ఆ విషయాన్ని నాతో చెప్పారు!" అన్నాడు వృద్ధుడు.



తనని చూసేందుకు ఓ స్త్రీ వస్తుందనీ, మరొకగది కావాలనీ మిస్టర్ లారీ హోటల్ మేనేజర్ని అడుగుట!

మిస్టర్ లారీకి నిద్రమత్తు వదిలింది. కల కరిగిపోయింది. అతడు పూర్తిగా కళ్ళు తెరిచి ప్రయాణీకులవంక చూసాడు. కాని వాళ్ళు ఎప్పుడో దిగి వెళ్ళిపోయారు.

మిస్టర్ లారీ డోవర్ వరకూ ఒంటరిగానే ప్రయాణం చేసాడు. డోవర్లో

అతడు 'రాయల్ జార్జి' హోటల్‌లో బసచేసాడు.

డోవర్‌నుండి ఫ్రాన్స్‌లోవున్న 'కాలైజ్'కి వెళ్ళాలంటే ఇంగ్లీష్ ఛానల్‌ని దాటి వెళ్ళాలి. మిస్టర్‌లారీ డోవర్‌లో పనిచూసుకొని కాలైజ్‌కి వెళ్ళాలి. ఇంగ్లీష్ ఛానల్ దాటి ఫ్రాన్స్ భూభాగానికి వెళ్ళే ప్రయాణీకుల పడవ ఆనాటి మధ్యాహ్నం వరకూ లేదు.

మిస్టర్‌లారీ హోటల్ వ్యవహారాలు చూసే గుమస్తా వద్దకు వెళ్ళి "నాకు ఇంకొక గది కావాలి!" అని అడిగాడు.

"దేనికి?" గుమస్తా ప్రశ్నించాడు.

"నన్ను కలుసుకునేందుకు ఓ యువతి వస్తుంది. ఆమె కోసం!" అన్నాడు మిస్టర్‌లారీ.

"అలాగే ఏర్పాటు చేస్తాను." అన్నాడు గుమస్తా.

"చూడు మిస్టర్! నా కోసం ఎవరైనా స్త్రీ వచ్చి 'టెల్‌సన్ బ్యాంక్ తాలూకు వ్యక్తి ఎవరైనా మీ హోటల్‌లో వున్నాడా?' అని అడిగితే ఉన్నాడని చెప్పు! ఆ విషయాన్ని తక్షణం నాకు తెలియజెయ్! నేను నా గదిలో వుంటాను." అన్నాడు మిస్టర్‌లారీ.

"టెలిసన్ బ్యాంక్‌కు సంబంధించిన వ్యక్తులు లండన్, పారిస్‌ల మధ్య తిరుగుతూనే ఉంటారు సార్!" అన్నాడు హోటల్ గుమస్తా.

"అవును! మా బ్యాంక్ ఆఫీసులు లండన్, పారిస్ నగరాలలో ఉన్నాయి" అన్నాడు మిస్టర్ లారీ.

రాత్రి భోజనానికి కూర్చున్నప్పుడు హోటల్ గుమస్తా మిస్టర్ లారీ గదికి వచ్చి "సార్! మీరు ఎదురు చూస్తున్న యువతి వచ్చి మీ గురించి అడిగింది. మిమ్మల్ని తక్షణం చూడాలి అంటున్నది. ఆమెను గదిలో కూర్చుండబెట్టి యిలా వచ్చాను" అని చెప్పాడు.

మిస్టర్ లారీ ఆమెను కలుసుకున్నాడు. ఆమె పేరు మిస్ మేనెట్!

ఆమె మిస్టర్ లారీని కూర్చోమని సంజ్ఞ చేసి "నేను మీ బ్యాంక్ నుండి వచ్చిన ఉత్తరాన్ని అందుకున్నాను. చనిపోయిన నా తండ్రి తాలూకు ఫ్రాన్స్‌లో వున్న ఆస్థుల గురించి ఆ ఉత్తరంలో తెలియబడింది. మీ సహాయంతో నన్ను ఫ్రాన్స్ వెళ్ళమని ఉత్తరంలో తెలియజేసారు. నేను చూస్తే అనాథ బాలికగా పెరిగాను. నాకు స్నేహితులెవరూ లేరు. మీరు లండన్ నుండి బయలుదేరిన తర్వాత ఇక్కడ నన్ను కలుసుకోమని మీకు వార్త అందింది కదా!" అని అడిగింది.

"అందింది!....కానీ...." మిస్టర్ లారీ మధ్యలో ఆగి మిస్ మేనెట్ ముఖం వంక చూసాడు.

"ఈ వ్యవహారం ఎటువంటిదో నాకు తెలియదు. దీని పర్యవసానం ఎటువంటిదైనా నేను భరిస్తాను....విషయమేమిటో చెప్పండి" అంది మిస్ మేనెట్.

మిస్టర్ లారీ యిలా చెప్పాడు : "నీ తండ్రిని నేను ఇరవై సంవత్సరాల క్రితమే ఎరుగుదును. అతను అప్పట్లో పేరు ప్రఖ్యాతులు గల పెద్ద డాక్టర్!.... ఫ్రాన్స్‌లో డాక్టర్‌ని తెలియని వారు లేరు. అతడు ఒక ఇంగ్లీషు యువతిని వివాహం చేసుకున్నాడు. అతని కార్యకలాపాలన్నీ మా బ్యాంక్ ద్వారా జరుగుతుండేవి. అతని వ్యాపార లావాదేవీలు అన్నీ టెల్‌సన్ చేతిలో ఉండేవి."

"ఆగండీ! ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. మీరే కదూ నేను చిన్నపిల్లగా ఉన్నప్పుడు ఫ్రాన్స్ నుండి లండన్ నగరానికి అనాథ శరణాలయంలో చేర్పించడానికి తీసుకొచ్చారు" అంది ఆమె తన గత స్మృతులను జ్ఞాపకం చేసుకుంటూ.

మిస్టర్ లారీ తల వంకిస్తూ "అవును! నేనే! నువ్వు పుట్టగానే మీ నాన్న కనిపించకుండా మాయమైపోయాడు. మీ అమ్మ మీ నాన్న ఎక్కడున్నదీ తెలుసు

కునేందుకు విశ్వ ప్రయత్నం చేసింది. అయినా ప్రయోజనం లేకపోయింది. నిరాశతోనే ఆమె చనిపోయింది, రెండేళ్ళ వయసున్న నిన్ను ఒంటరిగా వదిలి! ....అయితే కొత్తగా తెలిసిన విషయ మేమిటంటే నీ తండ్రికి ఫ్రాన్సులో ఎటువంటి ఆస్థిపాస్తులు లేవని!...." అన్నాడు.



మిస్ లూసీతో మిస్టర్ లారీ ఆమె తండ్రి విషయమై సంభాషించుట.

మిస్ మేనెట్ ముఖంలోని ఆవేదనకనిపెట్టిన మిస్టర్ లారీ యిలా అన్నాడు: "బాధపడకు మిస్ లూసీ! ఆస్థిపాస్తుల విషయమెలా ఉన్నా నీ కొక శుభవార్త చెబుతాను" అన్నాడు.

"ఏమిటి సార్ అది?" మిస్ లూసీ ప్రశ్నించింది.

"అందరూ అనుకుంటున్నట్టు మీ నాన్న చనిపోలేదు. బ్రతికే ఉన్నాడు. అయితే అతడిలో చాలా మార్పు వచ్చింది. ప్రస్తుతం అతడు తన పాత సేవకుడైన ఒకడి ఇంటిలో ఉంటున్నాడు. మనం ఇప్పుడు అక్కడికే వెళుతున్నాము. అతడు మీ నాన్న అవునో కాదో నేను గుర్తించగలను. అతడు నీ తండ్రే అయితే అతడికి నీ ప్రేమ, ఆదరణ, ఆప్యాయత కావలసి వస్తాయి—వాటితో అతడు తిరిగి మామూలు జీవన సరళికి తిరిగి వస్తాడు" అన్నాడు మిస్టర్ లారీ.

అది వినగానే లూసీ ముఖం తెల్లగా పాలిపోయింది. తన రెండు చేతుల తోనూ, అతడి రెండు భుజాలూ గట్టిగా పట్టుకుంది.

"నేను వెళ్ళి చూసేది బ్రతికివున్న మా నాన్నను కాదు- చనిపోయిన అతడి భూతాన్ని!.... అతడు బ్రతికి వున్నాడని ఎప్పటికీ తెలియకుండానే, బ్రతక వలసి వచ్చేది!" అంది లూసీ ఆవేదనగా.

"మరొక ముఖ్యవిషయం! డాక్టర్ మేనెట్ అక్కడ మరొక పేరుతో పిలువబడుతున్నాడు. అక్కడ మనం విషయసేకరణ చేయడం, యదార్థ విషయాలు మాట్లాడుకోవడం ఏమంత మంచిదికాదు. అది మీ నాన్న ప్రాణాలకే ముప్పు తెచ్చి పెడుతుంది. ఏ విధంగానైనా సరే, మీ నాన్నని ఫ్రాన్స్ నుండి యివతలికి తీసుకు రావడమే మన ముఖ్య లక్ష్యం! మీ తండ్రిని ఎవరైతే ఖైదులో పెట్టారో, ఇప్పటికీ ఫ్రాన్సును వాళ్ళే పరిపాలిస్తున్నారు. వాళ్ళకు అనుమానం కలిగితే ఇంగ్లీషు జాతీ యుడిగా, పేరు ప్రఖ్యాతులున్న బ్యాంక్ కర్మచారిగా నన్ను నేను రక్షించుకో గలను. కానీ మీ విషయంలో మాత్రం గ్యారంటీ యివ్వలేను" అన్నాడు మిస్టర్ లారీ.

లూసీ అలాగే చలనం లేకుండా కూర్చున్నది. మిస్టర్ లారీ వంక తీక్షణంగా చూడసాగింది. అతడి భుజాల మీదున్న ఆమె చేతులు బలంగా బిగుసుకోసాగేయి.

ఆమె తనని ఏమైనా చేయగలదు! అన్న అనుమానం మనసులో మెదల గానే మిస్టర్ లారీ "ఎవరైనా వచ్చి సహాయం చేయండి!" అంటూ బిగ్గరగా అరి చాడు.

అతడి కేకలు వింటూనే బలంగా వున్న ఓ యువతి విసురుగా ఆ గదిలోకి పరిగెత్తుకుంటూ వచ్చింది. పరిస్థితిని అర్థం చేసుకొని, మిస్టర్ లారీని, లూసీ చేతుల నుండి తప్పించి దూరంగా తోసేసింది. మిస్టర్ లారీ వెళ్ళి గోడకు గుద్దుకున్నాడు.

"చూడు మిస్టర్! ఆ పిల్ల చాలా సున్నిత మనస్తత్వం కలది. భయంకొలిపే

విషయాలు చెవితే భరించలేదు" అంది మిస్టర్ లారీతో.

ఆమె పేరు మిస్ ప్రాస్!....లూసీ చిన్నతనం నుండీ మిస్ ప్రాస్ సంరక్షణ లోనే ఉంటున్నది.

దాదాపు మూర్ఛలో మునిగిన లూసీకి ఉపచారాలద్వారా తెలివి వచ్చేటట్టు చేసింది మిస్ ప్రోజ్!....

3

'సెయింట్ ఆంథోనీ' అనేది పారిస్ నగరంలో ఒక భాగం. ఆ ప్రాంతం ఎప్పుడూ చీకటితోనూ, దుమ్ము ధూళితోనూ, రోగాలతోనూ, ఆకలితోనూ, బాధలు, ఆవేదనతో నిండి వుంటుంది. అక్కడున్న ఆకలిచూపులు ఎప్పుడూ నేల వంకే చూస్తూ ఉంటాయి. అక్కడి సందులు చాలా యిరుకుగా, అసహ్యంగా ఉంటాయి. సందులన్నీ ఆకలిగొన్న పేద ప్రజలతో నిండి ఉంటాయి. అక్కడి ప్రజల మనసుల్లో ద్వేషభావం తప్ప మరేదీ ఉండదు. తమ కష్టాలను, బాధలనూ పట్టించుకోని కులీనులైన ధనవంతుల మీదనే వారి ద్వేషమంతా!— విప్లవమంటూ వస్తే సెయింట్ ఆంథోనీ ప్రాంతంతోనే మొదట ప్రారంభమవుతుందని చెప్పడానికి ఆ ప్రాంత ప్రజల ఆకలిబాధలే తార్కాణం!

ఒకనాడు అక్కడున్న చిన్న సందులోకి వస్తున్న బండిమీద నుండి, ద్రాక్ష సారాయం ఉన్న పీపా ఒకటి దొర్లి నేలమీద పడింది. పడుతూనే పుచ్చ కాయలా పగిలింది. ఆ వెంటనే ద్రాక్షసారాయం, సందులోకి ప్రవహించింది. చాలా చోట్ల మడుగులవలె ఏర్పడింది.

అది ప్రజలు చూసారు. దప్పికగొన్న వాళ్ళ గొంతులు ద్రాక్ష సారాయం కోసం అంగలార్చాయి. ప్రజలు ద్రాక్ష సారాయం మడుగుల చుట్టూ గుమిగూడేరు. కొంతమంది నేలమీద పడుకుని కుక్కలు నీళ్ళు తాగినట్టు ద్రాక్ష సారాయాన్ని చప్ప రించడం ప్రారంభించారు. కొందరు చిన్న చిన్న పాత్రలు తెచ్చి వాటిని సారా యంతో నింపడానికి తంటాలు పడసాగేరు. పిల్లలున్న తల్లులు తమ చినిగిపోయిన గుడ్డలను ద్రాక్ష సారాయంలో ముంచి, వాటిని తమ పిల్లల చిన్ని నోళ్ళల్లో పిండ సాగేరు.

కొంతసేపటికి ఆ ప్రాంతంలో ప్రవహించిన ద్రాక్ష సారాయం యావత్తూ మాయమైంది. అక్కడక్కడ నేలమీద ఏర్పడిన మచ్చలు మాత్రం నెత్తుటి మరక లుగా కనిపిస్తున్నాయి.

అక్కడికి సమీపంగా ఒక బ్రాందీ షాపు ఉన్నది. బ్రాందీ షాపు యజమాని గుమ్మంలో నిలుచుని అదంతా చూస్తూనే ఉన్నాడు. ప్రజలంతా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత, అతడు షాపులో అడుగు పెట్టాడు.

బ్రాందీషాపు యజమాని పేరు 'ఎర్నెస్ట్ డిఫార్గ్!' బ్రాందీషాపు కౌంటర్‌లో



సెయింట్ ఆంథోనీ ప్రాంతంలోని ఒక సందులో వున్న బ్రాందీ షాపు తాలూకు ఒక బ్రాందీ పీపా నేలమీద పడి పగిలిపోతుంది. పేద ప్రజలు బ్రాందీని ఆప్యాయంగా త్రాగుట!

అతని భార్య 'థెరెసా డిఫార్గ్' కూర్చుని లేసు అల్లుకుంటున్నది.

షాపులో అడుగు పెట్టిన భర్త వంక చూస్తూ ఆమె కనుబొమలు ఎగ వేసింది! బ్రాందీ షాపులో ఒక మూలగా కూర్చున్న మిస్టర్ లారీ, మిస్ లూసీ

వంక చూడమని ఆమె ఉద్దేశం!—

డిఫార్గ్ తల తిప్పి వాళ్ళ వంక చూసాడు! తమకు కావలసిన వ్యక్తి అతడే నని మిస్టర్ లారీ గ్రహించాడు. నెమ్మదిగా లేచి వెళ్ళి డిఫార్గ్‌ని కలుసుకుని, తాము ఎవరైందీ వివరించి చెప్పాడు.

ఆ తర్వాత వాళ్ళిద్దరి మధ్యా రహస్య సంభాషణ కొనసాగింది. తన పాత యజమాని కూతురైన లూసీని చూసి డిఫార్గ్ ఎంతో సంతోషించాడు.

అతడు మిస్టర్ లారీని, లూసీని వెంట బెట్టుకుని షాపు వెలుపలికి వచ్చాడు. సందులో కొంతదూరం ప్రయాణం చేసిన తర్వాత ఎన్నో అంతస్థులున్న భవనంవద్ద ఆగాడు. ఆ భవనంలో ఎన్నో గదులున్నాయి. గదులనిండా ఎన్నో కుటుంబాలు కాపురముంటున్నాయి.

ఎర్నెస్టు డిఫార్గ్ మెట్లు ఎక్కి పైకివెళ్ళడం ప్రారంభించాడు. మిస్టర్ లారీ, లూసీ అతడ్ని అనుసరించారు.

"అతడు ఒక్కడే ఉంటున్నాడా?" అని మిస్టర్ లారీ అడిగాడు.

"అవును! ఒక్కడే ఉంటున్నాడు. అతనివద్ద ఎవరు ఉంటారు? .... ఒంటరిగానే గదిలో ఉంచి తాళం వేస్తాను" అన్నాడు డిఫార్గ్.

"ఎందుకు అలా చేయడం?" అని మిస్టర్ లారీ అడిగాడు.

"సంవత్సరాల క్రితం వాళ్ళు అతడ్ని నాకు అప్పగించినప్పుడు గదిలో పెట్టి తాళంవేసి ఉంచమన్నారు. ఆ విషయం ఎవరికీ తెలియనివ్వవద్దని హెచ్చరించారు" అన్నాడు డిఫార్గ్.

ఈలోగా వాళ్ళు చివరి అంతస్థుకు చేరుకున్నారు. అక్కడున్న గదుల్లో ఓ గదికి మాత్రమే తాళం వేసి వుంది. తను తెచ్చిన తాళం చెవితో డిఫార్గ్ తాళం తెరిచాడు.

తలుపులు తెరుచుకున్నాయి!....గదిలో అడుగు పెట్టేందుకు లూసీ భయపడింది.

"నాకు భయంగా ఉంది. నేను గదిలో అడుగు పెట్టలేను. నా తండ్రిని చూడలేను. అతడి దుర్భర పరిస్థితిని చూసి భరించలేను" అంది లూసీ.

మిస్టర్ లారీ ఆమెకు ధైర్యం చెప్పి గదిలోకి తీసుకువెళ్ళాడు. గదిలో చీకటిగా వుంది. గదికి ఒక మూలగా ఉన్న చిన్న కిటికీగుండా కొద్దిపాటి వెలుతురు లోనికి వస్తున్నది.

వృద్ధుడు గదిలో ఒక మూలగా కూర్చుని చెప్పులు తయారుచేస్తూ కని పించాడు. తెల్లని గడ్డం, లోతుకుపోయిన కళ్ళు, ఎముకల గూడులా కనిపిస్తున్న అతడి శరీరం, పీచులా చింపర వంపరగా వున్న జుట్టు, చిరిగి పేలికలైన అతడి బట్టలు చూసి లూసీ బాధలో కళ్ళనీళ్ళ పర్యంతమైంది.



గదిలో బంధింపబడిన తన తండ్రిని చూసేందుకు లూసీ, మిస్టర్ లారీ, డిఫార్జ్ గదిలో అడుగుపెట్టుట!

"నిన్ను చూసేందుకు ఎవరో వచ్చారు చూడు!" అన్నాడు డిఫార్జ్ వృద్ధుడితో.

వృద్ధుడు అతడి మాటలు పట్టించుకోకుండా చెప్పులు తయారుచేసే పనిలో

నిమగ్నుడయ్యాడు.

"మీరు తయారుచేస్తున్న చెప్పులు ఎటువంటివి?" అని అడిగాడు మిస్టర్ లారీ.

వృద్ధుడు తలపైకెత్తి "ఆడవాళ్ళు విహారానికి వెళ్ళేటప్పుడు వేసుకునే చెప్పులు." అని జవాబు చెప్పాడు.

"ఈ చెప్పులు తయారు చేసే వ్యక్తి పేరుఏమిటో?" అన్నాడు మిస్టర్‌లారీ.

వృద్ధుడు కొద్దినిముషాలు మౌనంగా ఉండి "ఈ చెప్పులు తయారు చేస్తున్న వాడిపేరు నూట అయిదు....నార్త్ టవర్!" అన్నాడు.

మిస్టర్ లారీ యిలా అన్నాడు మళ్ళీ: "చెప్పులు కుట్టడం నీ వృత్తి కాదు! చూడండి డాక్టర్ మేనెట్ మీరు నన్ను గుర్తుపట్టలేదా?"

అంటూ చేయెత్తి డిఫార్జ్ వంక చూపిస్తూ "అతడ్ని గుర్తుపట్టలేదా మీరు? అతడు మీ పాత సేవకుడు!" అన్నాడు.

భయంతో దూరంగా నిలబడిన లూసీ నెమ్మదిగా వచ్చి తండ్రి దగ్గరగా కూర్చుంది. వృద్ధుడు ఆమె వంక పరీక్షగా చూసాడు. వెంటనే ఆమె గౌను పుచ్చుకుని తోటకోసే కత్తిని పైకెత్తాడు.

అనుకోని ఆ సంఘటన చూస్తూనే మిస్టర్‌లారీ, ఎర్నెస్ట్ డిఫార్జ్ ఎంతో భయపడి లూసీని రక్షించాలని ముందుకొచ్చారు. లూసీ చేయెత్తి వారిని రావద్దని వారించింది.

"ఏమిటిదంతా? ఎవరు మీరు?" అన్నాడు వృద్ధుడు.

లూసీ ఏడుస్తూ తన చేతిని ముసలివాడి భుజంమీద వేసింది. ఆమె అలా చేయగానే వృద్ధుడి బలహీనమైన శరీరంలో ఏదో దివ్యానుభూతి కలిగింది. అతడు కత్తిని నేలమీద పడేసి లూసీ వంక తదేకంగా చూడసాగేడు. ఆమె బంగారు వెంట్రుకలను చేతికి తీసుకుని చూసాడు.

"ఇదెలా సంభవం? ఆ రాత్రి నాకు బాగా గుర్తు! వాళ్ళు నన్ను తీసుకు వెళ్ళిన రోజున ఇలాగే ఆమె కూడా నా భుజంమీద చేయి వేసింది. అయితే నేను వాళ్ళ నుండి తప్పించుకు రాలేకపోయాను. ఆమె నువ్వు కాదు గదా!.... ఆహఁ.... కాదు! నువ్వు చాలా చిన్నపిల్లవు. నువ్వు ఆమెవెలా అవుతావు. ఇంతకీ నీ పేరు ఏమిటమ్మా?" అన్నాడు వృద్ధుడు.

"చెబుతాను. నేనెవరో కూడా చెబుతాను. కానీ ఇప్పుడు కాదు. తర్వాత

చెబుతాను. అంతవరకు ఓపిక పట్టు" అంది లూసీ వృద్ధుడితో.

మిస్టర్ లారీ, ఎర్నెస్ట్ డిఫార్గ్ వాళ్ళ ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చూసేందుకు గది బయటికి వెళ్ళిపోయారు.

ఆ తర్వాత కొంతసేపటికి వేడివేడి భోజనాలు వాళ్ళిద్దరూ గదిలోకి తీసు



మిస్ లూసీ తన తండ్రితో, తానెవరైందీ సమయం వచ్చినప్పుడు చెబుతానని చెప్పుట.

కొచ్చారు. వృద్ధుడి కోసం మంచి దుస్తులు కూడా తెచ్చారు.

ఫ్రాన్స్ నుండి లండన్‌కు వెళ్ళేందుకు ఒక గుర్రపుబండిని కూడా ఏర్పాటు చేసారు.

డాక్టర్ మేనెటుని నెమ్మదిగా నడిపించుకుంటూ అందరూ మేడమెట్లు దిగి క్రిందికి చేరుకొన్నారు. అక్కడ గుర్రపు బండి వుంది. ఎవరైనా తమను చూస్తున్నారేమోనని మిస్టర్‌లారీ ఒక్కసారి చుట్టూ కలియజూసాడు.

ఆ సందులో తన బ్రాందీషాపు ముందు నిలుచుని లేసుఅల్లుతున్న మేడమ్ థెరెసా డిఫార్జు తప్ప ఎవరూ లేరు.

డాక్టర్ మేనెటు అతని కుమార్తె లూసీ మిస్టర్‌లారీ ఒకరి తర్వాత ఒకరు గుర్రపు బండిలో ఎక్కారు.

ఏం చేయాలో డిఫార్జ్ బండివాడికి వివరంగా చెప్పాడు నగరద్వారం వరకు డిఫార్జు బండిలో వెళ్ళాడు. సింహద్వారం వద్ద కాపలా వున్న మిలిటరీగార్డులతో డిఫార్జు ఏవో రహస్య సంభాషణలు జరిపాడు.

కొన్ని నిముషాల తర్వాత సిటీగేట్లు తెరుచుకున్నాయి. గుర్రపు బండి స్వేచ్ఛగా బయటికి వెళ్ళేందుకు అనుమతి లభించింది.

డిఫార్ అక్కడ బండినుంచి క్రిందికి దిగాడు. బండిలో వున్న వాళ్ళవద్ద సెలవు తీసుకొన్నాడు.

బండి సిటీగేటు దాటి ఫ్రాన్సునుండి లండన్‌కు బయలుదేరింది. ఫ్రాన్సు నుండి పారిస్‌నుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల దిక్కుగా బయలుదేరింది.

4

డాక్టర్ మేనెటు అతని కుమార్తె లూసీ మేనెటు ఇంగ్లండ్ వచ్చి అయిదు సంవత్సరాలు కావస్తున్నది. కుమార్తె సంరక్షణలో ప్రేమానురాగాలలో డాక్టర్ మేనెటు మామూలు మనిషి అయ్యాడు. యథాప్రకారంగా వైద్య వృత్తిని కూడా ప్రారంభించాడు

అది 1780వ సంవత్సరం అమెరికాలో వున్న తన వలస రాజ్యాలతో ఇంగ్లండ్ యింకా యుద్ధాలు చేస్తూనే వుంది. అమెరికాలో వున్న వలస రాజ్యాలకు ఫ్రాన్సు సహాయం చేస్తూ ఇంగ్లండ్‌కు శత్రువుగా తయారైంది.

దేశద్రోహులుగా అనుమానమున్న వారిమీద లండన్ మహానగరంలో కేసులు నడిపించి శిక్షలు వేయడం సర్వసాధారణ విషయంగా మారింది.

ఇందుకు పరోక్షంగా లండన్‌లో 'బెస్‌లే' కోర్టులో ఒక వ్యాజ్యం ప్రారంభమైంది.

ఇంగ్లండ్ తాలూకు మిలిటరీ రహస్యాలను ఫ్రాన్సుకు అందజేస్తున్నాడనీ

ఒక వ్యక్తి మీద అభియోగం మోపబడింది. ఆ వ్యక్తిని కోర్టుకు తీసుకు వచ్చారు.

ఆ ఖైదీ పేరు 'చార్లెస్‌డార్నే'!....వయసు ఇరవై అయిదు సంవత్సరాలు. అందమైన ముఖం, ఆకర్షణీయమైన శరీర సౌష్టవం.

చార్లెస్‌డార్నే బోనులో నిలుచున్నాడు. సాక్షులుగా డాక్టర్ అలెగ్జాండర్



ఛార్లెస్ డార్నే అనే యువకుడిమీద దేశద్రోహ నేరం మోపబడి కోర్టులో విచారణ జరుగుట!

మేనెటు అతని కూతురు మిస్‌లూసీ మేనెటు ఒకచోట బల్లమీద కూర్చున్నారు.

అయిదేళ్ళ క్రితం వాళ్ళు ఫ్రాన్స్‌నుండి ఇంగ్లండ్‌కు వస్తున్నప్పుడు నావ

మీద ఇంగ్లీష్ ఛానల్ దాటే సమయంలో చార్లెస్ డార్నే తండ్రీ కూతుళ్ళను నావ మీద కలుసుకోవడం జరిగింది.

మిస్టర్ లారీ కూడా సాక్షిగా కోర్టుకు హాజరయ్యాడు. అతడు యింకా టిల్సన్స్ బ్యాంక్‌లోనే పనిచేస్తున్నాడు.

ఖైదీకి వ్యతిరేకంగా అటార్నీ జనరల్ ఇద్దరు సాక్షులను ప్రవేశపెట్టాడు. అందులో ఒకడు జాన్‌బర్సాడ్ రెండవవాడు రోగర్ క్లై!....

ఇద్దరూ చార్లెస్ డార్నే వద్ద సేవకులుగా పనిచేస్తున్నారు. వాళ్ళిద్దరూ గూఢచార వ్యవహారం జరిపి, డార్నే టేబుల్ సొరుగులో నుండి, రహస్య కాగితాలు దొంగిలించి వాటిని ప్రభుత్వానికి అందజేసారనీ, ఆ కాగితాలలో ఇంగ్లండ్, ఉత్తర అమెరికాకు సైనిక దళాలను పంపే రహస్య సమాచారం ఉందనీ, దానిని ఫ్రాన్స్‌కు అందజేయడానికి ప్రయత్నిస్తున్నాడనీ, చార్లెస్ డార్నేమీద అభియోగం!—

చార్లెస్ డార్నే తరఫు న్యాయవాది మిస్టర్ స్ట్రీవర్! అతడి స్నేహితుడైన మిస్టర్ కార్టన్, కేసుయొక్క పూర్వాపరాలు ఆలోచించి, స్ట్రీవర్‌కి తగిన సలహాలు యిస్తూ ఉంటాడు. స్నేహితులిద్దరూ కలిస్తే, కేసు ఓడిపోవడమంటూ జరగదు.

మొదటి సాక్షి అయిన జాన్‌బర్సాడ్, నమ్మకస్తుడు కాడనీ, అతడొక దొంగ అనీ, జూదగాడనీ, అనేక నేరాలలో, అయిదు, ఆరుసార్లు జైలుకు వెళ్ళివచ్చాడనీ, కనుక అతడి మాటలు అబద్ధమనీ, మిస్టర్ స్ట్రీవర్ క్రాస్ పరీక్షలో నిరూపించగలిగాడు.

రెండవ సాక్షి అయిన రోగర్ క్లై కూడా దొంగ అనీ, అతడు చార్లెస్ డార్నేవద్ద సేవకుడిగా చేరింది నాలుగుసంవత్సరాలే అయినా అతడికి జాన్‌బర్సాడ్‌తో ఎనిమిది సంవత్సరాల నుండి సంబంధముందనీ, అతడు ఫ్రాన్స్ తరఫున గూఢచార వ్యవహారాలు నడుపుతున్నాడనీ, లాయర్ స్ట్రీవర్ క్రాస్ ఎగ్జామినేషన్‌లో ఋజువు చేసాడు.

తర్వాత అటార్నీ జనరల్, మిస్టర్ లారీని ప్రశ్నించడానికి బోనులోకి పిలిచాడు.

“1775వ సంవత్సరం నవంబర్ నెలలో ఒక శుక్రవారం రాత్రి మీరు లండన్ నుండి, డోవర్‌కు మెయిల్ కోచ్‌లో ప్రయాణం చేసారు. అప్పుడు మీతో ఎంతమంది ప్రయాణం చేస్తున్నారో చెప్పగలరా?” అటార్నీ జనరల్ మిస్టర్ లారీని

ప్రశ్నించాడు.

"ఇద్దరు!" మిస్టర్ లారీ జవాబు చెప్పాడు.

"అర్ధరాత్రివేళ, ఆ ఇద్దరు ప్రయాణీకులూ బండి నుండి దిగి వెళ్ళిపోయారు కదూ?"



బోనులో నిలబడి సాక్ష్యం చెబుతున్న మిస్ లూసీ, చార్లెస్ వేపు దీనంగా చూచుట.

"అవును!"

"అలా దిగిపోయిన వాళ్ళలో ఒకడు ఈ ఖైదీయే కదూ?"

"నేను చెప్పలేను! ఎందుకంటే అది చీకటి రాత్రి. అదీగాక నేను బండిలో

ఉన్నవారితో ఒక్క మాట కూడా మాట్లాడలేదు.”

“అయితే మిస్టర్ లారీ! ఈ ఖైదీని యింకెక్కడైనా చూసావా?” అటార్నీ జనరల్ ప్రశ్నించాడు.

“చూసాను! అది జరిగిన కొన్ని రోజుల తర్వాత, నేను ఫ్రాన్స్ నుండి లండన్ వస్తున్నప్పుడు నావలో చూసాను.”

“మీరు నావలో ఒంటరిగానే ప్రయాణం చేస్తున్నారా?”

“లేదు! నాతోబాటు డాక్టర్ మేనెటు, అతని కుమార్తె లూసీమేనెటు కూడా ఉన్నారు.” మిస్టర్ లారీ జవాబు చెప్పాడు.

“ఆ రాత్రి మీరు ఖైదీతో ఏమైనా మాట్లాడారా?”

“లేదు! ఆ రాత్రి కొద్దిగా తుఫాను గాలి వీచింది. నేను బైట ఉండలేక నా గదికి వెళ్ళి పడుకున్నాను” అన్నాడు మిస్టర్ లారీ.

తర్వాత బోనులోకి మిస్ లూసీమేనెటు రప్పించబడింది!

“చూడండి మిస్ మేనెట్! ఈ ఖైదీని మీరు ఎప్పుడైనా చూసారా?” అటార్నీ జనరల్ లూసీని ప్రశ్నించాడు.

“చూసానండీ! ఇంతకు క్రితం మిస్టర్ లారీ చెప్పినట్లు నేను యీ ఖైదీని ఇంగ్లీష్ ఛానల్‌లో నావమీద ప్రయాణం చేస్తున్నప్పుడు చూసాను.”

“మీ ఇద్దరి మధ్యా ఎటువంటి సంభాషణ అయినా జరిగిందా?”

“ఈ ఖైదీ మా నాన్నగారి ఆరోగ్యం గురించి మంచి సలహాలు యిచ్చాడు. అటువంటి వ్యక్తిని జాగ్రత్తగా చూసుకోవాలని చెప్పాడు.”

“ఇతడు నావ మీద ఒంటరిగా ఉన్నాడా? లేక ఇతడి వెంట ఇంకెవరైనా ఉన్నారా?”

“ఇతని వెంట మరొక ఇద్దరు వ్యక్తులున్నారు!”

“అప్పుడు నావ మీద వాళ్ళేం చేస్తున్నారు?”

“ముగ్గురూ నావమీద చాలాసేపు మాట్లాడుకున్నారు. ఆ తర్వాత ఇద్దరూ క్రిందికి దిగి వెళ్ళిపోయారు.” మిస్ లూసీ జవాబు చెప్పింది.

“వాళ్ళు మాట్లాడుకుంటున్న సమయంలో ఏమైనా కాగితాలు వాళ్ళ మధ్య మార్పిడి జరిగిందా?”

“అవునండీ! వాళ్ళ మధ్య కాగితాలు యిచ్చి పుచ్చుకోవడం నేను చూసాను. కానీ అవి దేనికి సంబంధించిన కాగితాల్లో నాకు తెలియదు”

"వాళ్ళు కాగితాల గురించి ఏమైనా మాట్లాడుకున్నారా?"

"వాళ్ళు చాలా నెమ్మదిగా మాట్లాడుకున్నారు. అందుచేత వాళ్ళు ఏం మాట్లాడుకున్నదీ నేను వినలేకపోయాను." అంది లూసీ.

"ఈ ఖైదీ నీతో ఏం మాట్లాడాడు?"

"మా నాన్నగారి ఆరోగ్యం గురించి అడిగి తెలుసుకున్నాడు. నాతో చక్కగా సంభాషించాడు. అయితే నేనొక విషయం చెప్పాలనుకుంటున్నాను. అది ఇతడికి ఎటువంటి హానీ చేయలేదనే భావిస్తున్నాను." అంది లూసీ.

"చూడు మిస్ మేనెట్! తనకు తెలిసిన విషయాలన్నీ కోర్టువారికి మనవి చేయడం సాక్షి విధ్యుక్త ధర్మం. తనుక అదేమిటో నిస్సంకోచంగా తెలియజెయ్!" అన్నాడు జడ్జి.

"ఒక అత్యవసరమైన పనిమీద వెళుతున్నాననీ, దానివలన కొంతమందిని ఆపదల నుండి రక్షించడం జరుగుతుందనీ దానికోసం ఫ్రాన్స్ నుండి లండన్‌కు వెళ్ళవలసి వస్తున్నదనీ ఈ ఖైదీ నాతో చెప్పాడు." అంది లూసీ.

"ఇతడు అమెరికన్ వలస రాజ్యాల గురించి నీతో ఏమైనా చెప్పాడా?" అటార్నీ జనరల్ ప్రశ్నించాడు.

"ఇంగ్లండ్ అమెరికాతో తగువు పెట్టుకోవడంలో చాలా తెలివి తక్కువగా వ్యవహరిస్తున్నది. బహుశా జార్జివాషింగ్టన్, మూడవ జార్జి చక్రవర్తిలాగే చరిత్రలో పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తాడు! అని ఇతడు నాతో అన్నాడు. ఇదంతా అతడు సరదాగానే అన్నాడు." అంది లూసీ

ఆ వెంటనే కోర్టు గదిలో ప్రేక్షకుల మధ్య అలజడి ప్రారంభమైంది. తమ రాజును అవమానిస్తూ మాట్లాడినందుకు జడ్జిగారికి ఖైదీమీద విపరీతమైన కోపం వచ్చింది.

తర్వాత సాక్షిగా డాక్టర్ అలెగ్జాండర్ మేనెట్ బోనులోకి వచ్చాడు.

"డాక్టర్ మేనెట్! మీరు ఎప్పుడైనా యీ ఖైదీని కలుసుకున్నారా?" అటార్నీ జనరల్ ప్రశ్నించాడు.

"మూడు సంవత్సరాల క్రితం ఇతడు లండన్‌లో వున్న మా ఇంటికి వచ్చాడు" డాక్టర్ మేనెటు జవాబు చెప్పాడు.

"ఇతడు మీతోబాటు నావలో ప్రయాణం చేసాడు అప్పుడు ఇతడు మీ అమ్మాయితో ఏం మాట్లాడాడో చెప్పగలరా?"

"అప్పట్లో నా మానసిక పరిస్థితి బాగుండలేదు. కనుక ఇతడు మా అమ్మాయితో ఏం మాట్లాడాడో చెప్పలేను."

"చూడండి డాక్టర్ మేనెటు! మీరు మీ జీవితంలో చాలా భాగాన్ని ఫ్రాన్స్ లోని జైలులో గడిపారనీ అదైనా కోర్టులో కేసు జరగకుండానే జైలు జీవితం



డాక్టర్ మేనెట్ (లూసీ తండ్రి) బోనులో నిలబడి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి సమాధానం చెప్పుట!—

గడిపారు అవునా?"

"అవునండీ. చాలా సంవత్సరాలు గడిపాను. జైలు జీవితం గడిపిన ఆ కాలంలో నా మేధస్సు యావత్తూ శూన్యంగా మారిపోయింది."

అటార్నీ జనరల్ ఒక సాక్షిని బోనులోకి పిలిపించి కొన్ని ప్రశ్నలు వేసాడు.

ఆ తర్వాత ఖైదీతరపు న్యాయవాది అయిన మిస్టర్ స్ట్రీవర్ ఆ సాక్షిని క్రాస్ఎగ్జామిన్ చేయడానికి లేచాడు.

"ఆ రాత్రి యీ ఖైదీని ఫ్రాన్స్‌లో చూసానంటున్నావు కదా! ఆ విషయాన్ని ఖచ్చితంగా చెప్పగలవా?" అన్నాడు స్ట్రీవర్.

"ఈ ఖైదీనే చూసానన్న విషయాన్ని ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు సాక్షి.

"ఈ ఖైదీలాగే వున్న వ్యక్తిని ఎప్పుడైనా చూసావా?"

"ఇద్దరు వ్యక్తులు ఎప్పుడూ ఒకేలాగ వుండరు. ఆ తేడా చాలా తేలికగా తెలుసుకోవచ్చు." అన్నాడు సాక్షి.

"అయితే యిక్కడ కూర్చున్న నా స్నేహితుడివంక ఒక్కసారి చూడు!" మిస్టర్ స్ట్రీవర్ మిస్టర్ కార్టన్ వంక చేయెత్తిచూపిస్తూ" నా స్నేహితుడూ, ఆ ఖైదీ మధ్య నీకు ఏదైనా తేడా కనిపిస్తున్నదా? ఇద్దరూ ఒకేలాగ వున్నారా? లేక వేరేగా కనిపిస్తున్నారా?"

కోర్టు గదిలో కూర్చుని వున్న ప్రేక్షకులు ఖైదీవంకా మిస్టర్‌కార్టన్ వంకా పదే పదే పరీక్షగా చూసారు. వారికి ఇద్దరూ వయసులోకానీ రంగు రూపంలో కానీ ఎత్తులోకానీ ఒకే మోస్తరుగా కనిపించారు.

జ్యూరీ సభ్యులు కూడా వాళ్ళిద్దర్నీ పరీక్షగా చూసారు. వాళ్ళు తమలో తాము సంప్రదించుకొని తమ అభిప్రాయాన్ని యిలా తెలియజేసారు: "ఇతడు నేరస్థుడుకాదు"

మిస్టర్‌డార్నే నిర్దోషిగా విడుదల చేయబడ్డాడు. కోర్టుగది యావత్తూ నిర్మానుష్యమైంది.

డాక్టర్ మేనెటు లూసీ మేనెటు లాయర్ స్ట్రీవర్ మిస్టర్‌లారీ....డార్నే చుట్టూ చేరి, అతడు విడుదల అయినందుకు అభినందించడం ప్రారంభించారు.

అతడి విడుదలకు ఎక్కువగా సహాయపడిన మిస్టర్ కార్టన్‌ను ఎవరూ గుర్తించలేదు. కార్టన్ అవన్నీ పట్టించుకోడు. అతను ఏకాకి జీవితంలో బాగా దెబ్బ తిన్న వ్యక్తి. ఎప్పుడూ తాగుతూ బాధల్ని మరచి పోవడానికి ప్రయత్నిస్తూ వుంటాడు.

మిస్టర్ కార్టన్ డార్నేతో యిలా అన్నాడు: "ఇది మీకు కొత్త అనుభవాన్ని చవి చూపించి ఉండవచ్చు. మనమిద్దరం ఇంచుమించుగా ఒకేలాగ ఉండటం, ఈ కేసు గెలవడానికి ఒక కారణం!"

"నేను విడుదల అయ్యానన్నది యిప్పటికీ నమ్మలేకుండా ఉన్నాను."



నిర్దోషిగా విడుదలైన ఛార్లెస్ డార్నే న్యాయవాది సిడ్నీ కార్టన్ బ్రాందీషాపులో కలుసుకొనుట!

"నువ్వు చాలా నీరసంగా ఉన్నావు. భయాందోళనలతో మానసిక క్షోభ పొంది ఉంటావు. పద ఏదైనా హోటల్ కి వెళ్ళి భోజనం చేద్దాం!" అన్నాడు మిస్టర్ కార్టన్, డార్నేతో.

ఇద్దరూ కలిసి హోటల్‌కి వెళ్ళారు. భోజనాలు రాగానే తినడం ప్రారంభించారు.

కార్టన్, డార్నే ముఖం వంక చూస్తూ "ఒక అందమైన అమ్మాయి సాక్ష్యం చెబుతూ నీ కోసం సానుభూతి కనపరచడం, కంటతడి పెట్టుకోవడం, చూసిన నీకు ఏమనిపిస్తున్నది మిస్టర్ డార్నే!....ఆమె నీ విడుదలకోసం అలా ప్రయత్నించడం నీ జీవితానికి ఎంతో విలువైన విషయం కదూ మిస్టర్ డార్నే' అన్నాడు.

మిస్టర్ డార్నే నవ్వి "మీరు చాకచక్యంతో మిస్టర్ స్ట్రివర్‌కి కేసుమధ్యలో సలహాలు యివ్వడంవల్లనే, నేను రక్షింపబడ్డాను. అందుకు మీకు కృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను" అన్నాడు కార్టన్‌తో.

"మీ విషయంలో ఎందుకు అలా చేసానో నాకే తెలియదు. నువ్వంటే నాకు యిష్టమే లేదు!" అన్నాడు కార్టన్ బ్రాందీ తాగుతూ.

"ఇక నేను వెళతాను మిస్టర్ కార్టన్!" వెళ్ళడానికి లేచాడు డార్నే.

"చివరగా ఒక్కమాట డార్నే!— నేను తాగుబోతునని నువ్వు భావిస్తున్నావా?" అని అడిగాడు కార్టన్.

"మీరు ఆ విధంగా అడిగితే రేయింబవళ్ళు తాగుతూనే ఉంటారని చెప్పక తప్పదు."

"అయితే నేనిలా దేనికి తాగుతూ ఉంటానో మీరు తెలుసుకోవాలి! నేనొక నిరాశావాదిని. నా గురించి ఆలోచించేవారు కానీ జాగ్రత్త తీసుకునేవారు కానీ ఎవ్వరూ లేరు."

అప్పుడు డార్నే యిలా అన్నాడు: "మీకు అద్భుతమైన జ్ఞాన సంపద వుంది. మీ జీవితాన్ని ఎలా మలుచుకోవాలన్నా అందుకు మీరు సమర్థులు. మీకు మీరు మంచిని ఎందుకు చేసుకోగూడదు?"

కార్టన్ జవాబు చెప్పలేదు. అలా తాగుతూనే ఉన్నాడు. డార్నే నెమ్మదిగా బయటికి వెళ్ళిపోయాడు. తన దగ్గరున్న సీసాలోని బ్రాందీ మొత్తం అయిపోయే వరకు కార్టన్ అక్కడే కూర్చున్నాడు. ఆ తర్వాత బల్లమీద చేతులు చాచుకుని తల వాల్చి అలాగే నిద్రపోయాడు.

మిస్టర్ స్ట్రివర్ పేరు పొందిన అడ్వకేటు!....కోర్టు గదిలో మిస్టర్ కార్టన్ కీలకమైన సలహాలు స్ట్రివర్‌కి అందచేస్తూ ఉంటాడు. వాటి సహాయంతో స్ట్రివర్ కేసులు గెలుస్తూ ఉంటాడు. ఆ రోజు జరిగిన కేసు తాలూకు పూర్వాపరాలనుఆ

ఇద్దరు స్నేహితులు సాయంత్రపు వేళ ఒకచోట కూర్చుని చర్చించుకోవడం వాళ్ళ దినచర్యలో ఒక భాగం.

స్ట్రీవర్ ఆఫీసు గదిలో ఆ సాయంత్రం ఇద్దరు స్నేహితులు సమావేశ మయ్యారు.



డాక్టర్ మేనెటు, మిస్ లూసీ, మిస్టర్ లారీ చెట్టుక్రింద కూర్చుని సంభాషిస్తుండగా ఛార్లెస్ డార్నె అక్కడికి వచ్చుట.

"ఈ రోజు బోనులో నిలబడి సాక్ష్య మిచ్చిన అందమైన సాక్షిని గురించి చర్చించుకుందాం!" అన్నాడు మిస్టర్ స్ట్రీవర్.

"ఎవరా అందమైన సాక్షి?" ప్రశ్నించాడు కార్టన్ ఆశ్చర్యపోతూ.

"ఎవరని అడుగుతున్నావా? నువ్వూ చూసావు కదా! ఆ అందమైన సాక్షిని!....అదే, మిస్ లూసీ మేనెటు!" అన్నాడు స్ట్రీవర్ మందహాసం చేస్తూ.

ఆ విషయం గురించి సంభాషణ పెంచడం కార్టన్‌కి యిష్టంలేదు. అప్పుడు కూడా అతను తాగుతూనే ఉన్నాడు. నెమ్మదిగా లేచి ఇంటికి బయలుదేరాడు. అతని ఇంటిలో కార్టన్ ఒక్కడే సభ్యుడు. మంచం మీద ఏకాంతంగా పడుకుని ఆలోచిస్తూ, మానసిక క్షోభను అనుభవిస్తూ, తనకు తెలియకుండానే కారే కన్నీటిని తుడుచుకుంటూ రాత్రుళ్ళు గడపడం కార్టన్‌కు అలవాటు!....

ఆ రాత్రి కూడా అన్ని రాత్రుళ్ళు మాదిరిగా నిరాశతోనే గడిచిపోయింది సిడ్నీ కార్టన్‌కి!

చార్లెస్ డార్నే మీద కేసు నడిచి అప్పటికి నాలుగు నెలలు కావస్తున్నది.

మిస్టర్ లారీ, ఛార్లెస్ డార్నే, సిడ్నీ కార్టన్, డాక్టర్‌గారి ఇంటికి అప్పుడప్పుడూ రావడం ప్రారంభించారు. లండన్‌లోని సోహోస్క్వేర్‌లో ఉన్నది డాక్టర్ గారి ఇల్లు.

ఆ రోజు మిస్టర్ లారీ డాక్టర్‌గారి ఇంటికొచ్చాడు!

"డాక్టర్ మేనెటు, మిస్ లూసీ బయటికి వెళ్ళారు. ఈ పాటికి వస్తూనే ఉంటారు. మీరు గదిలో కూర్చోండి!" అంది మిస్ ప్రాజ్.

మిస్టర్ లారీ గదిలో కూర్చున్నాడు. కొంతసేపటికి డాక్టర్, మిస్ లూసీ రానే వచ్చారు.

డాక్టర్ మేనెటు, మిస్టర్ లారీని చూస్తూనే మందహాసం చేసి "రండి! అలా వెళ్ళి చెట్టుక్రింద కూర్చుదాం!" అంటూ చెట్టు వద్దకు దారితీసాడు.

మిస్ లూసీ, మిస్టర్ లారీ అతడి వెనుకగా చెట్టు దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు. అంతలో ఛార్లెస్ డార్నే అక్కడికి వచ్చాడు.

వాళ్ళ సంభాషణలో అనేక విషయాలు చోటుచేసుకున్నాయి.

చివరకు డార్నే సంభాషణ మరొక విషయం మీదికి మళ్ళిస్తూ "చూడండి, డాక్టర్! మీరు ఎప్పుడైనా, నార్త్ టవర్ జైల్లో ఉన్నారా?" అని అడిగాడు.

"నేను ఆ జైలులో చాలా సంవత్సరాలు ఉన్నాను" అన్నాడు డాక్టర్ మేనెటు.

"నేను కూడా కొన్నాళ్ళు అందులో ఉన్నాను. ఆ తర్వాత నా మీద కేసు నడిచింది. నేను నార్త్ టవర్‌లో ఉండగా అక్కడ పని చేసేవాళ్ళు, నార్త్ టవర్

లోని కొన్ని విషయాలను కథలుగా చెబుతుండేవారు. ఖైదీలు తమ పేర్లతో, తమను అన్యాయంగా బంధించిన విషయాలతో, గోడల మీద రాసి అసహ్యంగా తయారు చేసేవారట. ఒకసారి పనివాళ్ళు టవర్‌లోని నేలను బాగుచేస్తుండగా, ఒక రాయి క్రింద దాచిన ఓ కాగితం బైటపడిందట. అది ఎవరో నిరపరాధి అయిన ఖైదీ,



ఛార్లెస్ చెప్పిన విషయం వింటూనే డాక్టర్ ముఖం భయంతో పాలి పోవుట!

తన ఆవేదన వెళ్ళబోసుకుంటూ రాసిన కాగితమై ఉంటుంది. అయితే ఆ కాగితం మట్టికొట్టుకుపోయి, అక్షరాలు కనిపించకుండా చివికిపోయి ఉన్నదట. అందులో ఏం రాసి ఉందో తెలుసుకునేందుకు అధికారులు విశ్వప్రయత్నం చేసారట. కానీ ప్రయో

జనం లేకపోయిందట."

అది వింటూనే డాక్టర్ మేనెటు ఉలిక్కిపడ్డాడు. అతని ముఖం భయంతో పాలిపోయింది. అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది. అటు యిటు పిచ్చిగా చూడసాగేడు.



కులీనుడైన మార్కుస్ ఎవర్‌మాండే గుర్రపు బండిక్రింద కుర్రవాడొకడు పడి మరణిస్తే అతడి తండ్రి కుర్రవాడిని ఎత్తుకుని దుఃఖించుట!

"ఏమైంది నాన్నగారూ?....అలా అయిపోయారేమిటి?" అంది మిస్ లూసీ తండ్రి ముఖంలోకి చూస్తూ.

"ఏం లేదమ్మా!....వాతావరణంలోని మార్పువల్ల శరీరానికి కొంత ఇబ్బంది కలిగినట్టుంది. మీరు కూర్చుని మాట్లాడుతూ ఉండండి. నేను వెళ్ళి కొంతసేపు

విశ్రాంతి తీసుకుంటాను-" అని చెప్పి డాక్టర్ మేనెటు నెమ్మదిగా లేచి లోనికి వెళ్ళిపోయాడు.

డాక్టర్ మేనెటులోని మార్పుకు కారణం వాతావరణం కాదనీ, ఛార్లెస్ డార్నే చెప్పిన నార్త్ టవర్ విషయాలే అందుకు కారణమై ఉంటాయనీ, మిస్టర్ లారీ యిట్టే గ్రహించాడు.

## 4

ఫ్రాన్స్ చక్రవర్తి కొలువులో మార్క్విస్ ఎవర్మాండే ఓ చిన్న ప్రభువు. ఉన్నత వంశానికి చెందిన కులీనుడు—

అతడొకనాడు రాజుగారి ఆస్థానంలో వినోదాలు, వేడుకలు చూసుకుని, గుర్రపు బండిమీద తన కోటకు బయలుదేరాడు. బండివాడు గుర్రాలను వేగంగా తోలుతున్నాడు. బండి ఓ ఇరుకు సందుగుండా వెళుతున్నది.

మార్క్విస్ ప్రభువుకు పేదలన్నా, వాళ్ళ స్థితిగతులన్నా ఎంతో అసహ్యం. అయినా వాళ్ళకు తన హోదా, ఆడంబరం, గొప్పతనం చూపించాలని సరదా పడుతూ ఉంటాడు.

ఆ ఇరుకు సందుగుండా వస్తున్న బండిని చూసిన ప్రజలు పక్కకు తప్పుకుంటున్నారు. అలా వేగంగా వస్తున్న గుర్రపుబండి ఒకచోట కళ్ళెం వేసినట్టు ఆగిపోయింది.

బండి చక్రాలకు ఏదో వస్తువు కొట్టుకున్న శబ్దమైంది. బండివాడు గుర్రాలను అదిలించాడు కానీ, అవి ముందుకు వెళ్ళమని మొరాయించాయి. ఆ ఇరుకు సందులో జనసందోహం ఎక్కువగా ఉన్నా, ఆ సందులో నుంచే, వేగంగా వెళ్ళడం మార్క్విస్‌కి సరదా!—

బండి ఆగిన వెంటనే అక్కడ పేద ప్రజలు గుమిగూడడం ప్రారంభించారు.

పొడవుగా ఉన్న ఒక వ్యక్తి రొమ్ములు బాదుకుంటూ, బండి దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతడు బండికి కట్టిన గుర్రాల కాళ్ళవద్ద నుండి ఓ పిల్లవాడిని తీసి, ఆ శరీరాన్ని ఒక ప్రక్కగా పడుకోబెట్టాడు. ఆ తర్వాత పెద్దగా ఏడుస్తూ పిచ్చివాడిలాగ బిగ్గరగా అరవడం ప్రారంభించాడు.

చినిగి పీలికలైన వస్త్రాలు ధరించి, చూసేందుకు అసహ్యంగా వున్న ఒక వ్యక్తి బండి వద్దకొచ్చి "ప్రభువులు మన్నించాలి. పాపం, ఆ కుర్రవాడు అతని కుమారుడే! తమ బండిక్రింద పడి నలిగిపోయాడు" అని చెప్పాడు.

మరుక్షణం కుర్రవాడి తండ్రి దిగ్గున పైకి లేచాడు. పెద్దగా అరుస్తూ బండి వద్దకు పరిగెత్తుకుంటూ రాసాగేడు.

మార్క్విస్ ప్రభువు ప్రమాదాన్ని గ్రహించాడు. చప్పున అతడి చేయి ప్రక్కనే వున్న ఖడ్గం మీదికి వెళ్ళింది. అయినా అతను తమాయించుకుని, బండి చుట్టూ మూగిన గుంపు వంక తీక్షణంగా చూసాడు.



కొడుకు చనిపోయిన దుఃఖంలో కోపోద్రిక్తుడైన గాస్‌ఫర్డ్‌ని, మిస్టర్ డిఫార్జ్ ఓదార్చుట.

'అవసరమైతే ఆ సందులో రక్తపుటేరులు ప్రవహింపజేయడానికి గూడ వెనుకాడను!' అన్న భావం మార్క్విస్ చూపులో కనిపించింది. దానితో ఆ పేద ప్రజలు శిలా ప్రతిమల్లా, నిలబడిపోయారు.

"చంపేసాడు!.... నా కొడుకు చనిపోయాడు!" అన్నాడు ఆ కుర్రవాడి తండ్రి జనం వంక చూస్తూ.

ఎవరూ నోరు మెదపలేదు. అందరి దృష్టీ మార్క్విస్ ప్రభువు మీదనే ఉంది.

తక్షణం మార్క్విస్, పర్సులో నుండి ఓ బంగారు నాణెం యివతలికి తీసి, దానిని వీధిలోకి గిరవాటు వేసాడు.

తర్వాత యిలా అన్నాడు :

"వీధిలో తిరిగేటప్పుడు మీ విషయంలో కానీ, మీ పిల్లల విషయంలో కానీ మీరెందుకు జాగ్రత్తలు తీసుకోరో నాకు అర్థం కావడంలేదు. ఆ కుర్రవాడి మూలంగా నా గుర్రాలలో ఒకదానికి హాని కలిగింది, తెలుసా?"

అదే సమయంలో లావుగావున్న ఒక వ్యక్తి అక్కడికి వచ్చాడు. అక్కడ మూగిన ప్రజలు పక్కకు తప్పుకుని ఆ వ్యక్తికి చోటు యిచ్చారు.

కుర్రవాడి తండ్రి ఏడుస్తూ ఏం జరిగిందీ ఆ వ్యక్తికి వివరించి చెప్పాడు.

"చూడు గాస్పర్డ్!.... ఆ చిన్నపిల్లవాడు జీవితంలో ఆకలిబాధలు, ఆవేదనలు అనుభవించేకన్నా బాధలు పొందకుండా యీ విధంగా చనిపోవడం మంచిది కదూ!....మనవంటి పేదవారికి అంతకంటె అదృష్టం మరొకటి ఉంటుందా చెప్పు?" అన్నాడా వ్యక్తి.

"నువ్వు ఎవరివోకానీ చాలా జ్ఞానమున్న వ్యక్తివలె కనిపిస్తున్నావు. నీ పేరేమిటి?" అని అడిగాడు మార్క్విస్ నవ్వుతో.

"నా పేరు ఎర్నెస్ట్ డిఫార్జ్! బ్రాందీషాపు యజమానిని. నా షాపు ఈ సందులోనే వుంది" అన్నాడు డిఫార్జ్.

మార్క్విస్ పర్సునుండి మరొక బంగారునాణెం తీసి దానిని వీధిలోకి విసురుతూ "చూడు డిఫార్జ్! ఆ బంగారు నాణెం తీసుకో! దానిని ఏ విధంగా ఖర్చు పెడితే బాగుంటుందో ఆ విధంగా చెయ్!" అన్నాడు.

ఆ తర్వాత మార్క్విస్ తృప్తిగా ఊపిరి పీల్చుకుని బండిలో వెనక్కి వాలి కూర్చున్నాడు. అంతటితో తన బాధ్యత తీరిపోయిందని భావించాడు మార్క్విస్ ప్రభువు.

ఆ రోజుల్లో పేదవాళ్ళ ప్రాణాలకు విలువలేదనీ ప్రభువులైన కులీనుల దృష్టిలో అవి గడ్డిపోచకంటే హీనమైనవని, యీ సంఘటనతో ఋజువవుతున్నది.

"ఊఁ....బండిని ముందుకు పోనియ్!" అన్నాడు మార్క్విస్ బండివాడితో.

బండి బయలుదేరింది. అయితే అదే సమయంలో ఓ బంగారునాణెం గాలిలో గిరగిరా తిరుగుతూవచ్చి బండిలో కూర్చున్న మార్క్విస్ కాళ్ళముందు పడింది.

"ఎవరు యిలా విసిరింది?" అంటూ మార్క్విస్ బండిలోనుండి తల



మిస్టర్ డిఫార్జు భార్య లేసు అల్లుతూ మార్క్విస్ వేపు క్రోధంగా చూచుట !

యివతలికి పెట్టి చూసాడు.

ఒక్కక్షణం క్రితం కుర్రవాడి తండ్రి, డిఫార్జు నిలుచున్నచోట యిప్పుడు లావుగా ఎత్తుగావున్న యువతి నిలబడి లేసు అల్లుతూ మార్క్విస్ కంటబడింది. అతడు ఆమె వంక తీక్షణంగా చూసాడు. ఆమె చూపులు కూడా అంతకంటె

తీక్షణంగా మార్కుస్‌ని చూడసాగేయి.

"వీధి కుక్కలు!.... బంగారునాణెం తిరిగి నామీదికి విసిరి నన్ను అవమానించిన వారెవరో తెలిస్తే కుక్కను కాల్చినట్టు కాల్చిపారేసేవాడిని!" అన్నాడు మార్కుస్.



ఒక వ్యక్తి మార్కుస్‌తో బండి క్రింద గొలుసు పుచ్చుకుని ఎవరో వచ్చినట్టు చెప్పుట !

అక్కడున్న ప్రజలు భయంతో తలలు వంచుకున్నారు. ఒక్క మేడమ్ డిఫార్గు మాత్రం తలెత్తి ద్వేషభావంతో మార్కుస్ ముఖంలోకి చూసింది.

మార్కుస్ ఇంకేమీ మాట్లాడలేదు. బండి ముందుకు బయలుదేరింది. ఓ

గంటసేపు ఆ విధంగా ప్రయాణంచేసిన తర్వాత మార్కస్ అధిరోహించిన బండి ఓ పల్లెటూరు ప్రాంతానికి చేరింది. అప్పటికి సాయంకాలం కావస్తున్నది. చీకట్లు నలిశలా అలుముకుంటున్నాయి. గుర్రాలను మార్చేందుకు గుర్రపుబండి ఆ పల్లె ప్రాంతంలో ఆగింది.

అప్పుడు మార్కస్ బండివద్దకు ఓ వ్యక్తి వచ్చాడు. అతడు చూసేందుకు చాలా అసహ్యంగా ఉన్నాడు.

"ప్రభూ! నేను ఊరి వెలుపలనుండి వస్తున్నప్పుడు ఒక వ్యక్తి మీ బండి క్రిందవున్న ఇనుపగొలుసును పట్టుకుని వ్రేళ్ళాడుతూ రావడం చూసాను" అని చెప్పాడా వ్యక్తి మార్కస్‌తో.

"ఎవడా వ్యక్తి? నువ్వు గుర్తుపట్టావా వాడిని?" అని అడిగాడు మార్కస్.

"లేదు ప్రభూ! ఆ విధంగా చాలా దూరం నుంచి వస్తున్నాడేమో బాగా మట్టి కొట్టుకుని వున్నాడు. అదీగాక మీ బండి గుర్రాలు వేగంగా పరిగెడుతుండడం వల్ల వాడిని గుర్తు పట్టే అవకాశం లేకపోయింది. బహుశా వాడు యీ ప్రాంతానికి కొత్తవాడై వుంటాడని నా అనుమానం" అన్నాడా వ్యక్తి వినయంగా.

మార్కస్ వెంటనే ఆ గ్రామాధికారి పన్నులు వసూలుచేసే అధికారి అయిన 'గాబెల్'ని తన వద్దకు పిలిపించాడు.

"చూడు గాబెల్! ఎవడో తుంటరి వెధవ మా బండి క్రిందవున్న గొలుసును పట్టుకుని యీ ప్రాంతం వరకూ బండితోబాటే వచ్చాడట. బహుశా వాడు ఈ రాత్రికి గ్రామంలోకి రహస్యంగా రావచ్చు. రక్షక భటులను కాపలా వుంచి ఎలాగైనా సరే వాడిని పట్టిబంధించి నాకు కబురుచెయ్! కొత్త వాళ్ళు ఎవరు కనిపించినా సరే విడిచిపెట్టకు!" అని చెప్పాడు మార్కస్.

"చిత్తం! తమరు చెప్పినట్లే వాడిని పట్టి బంధిస్తాను." అన్నాడు గాబెల్.

తిరిగి బండి బయలుదేరింది. గుర్రాలు వేగాన్ని పుంజుకున్నాయి. బాగా చీకటి పడింది. కొంత సేపటికి గుర్రపు బండి వచ్చి ఒక పెద్ద కోటముందు ఆగింది. కోట చాలా నిశ్శబ్దంగా వుంది. కోటలో దీపాలు లేవు. మార్కస్ బండి దిగి కోటలోపలికి వెళ్ళాడు. నలుగురైదుగురు సేవకులు తప్ప మరెవరూ ఆ కోటలో లేరు. మార్కస్ వచ్చిన తర్వాత దీపాలు వెలిగించ బడ్డాయి.

"నా సోదరుని కుమారుడు యీ రాత్రికి వచ్చి నన్ను కలుసుకుంటానని

లండన్ నుంచి వర్తమానం పంపించాడు. అతను వచ్చాడా?" అని ఆ సేవకుడ్ని అడిగాడు మార్కుస్.

"ఎవరూ రాలేదు ప్రభూ!" జవాబు చెప్పాడు సేవకుడు.

"సరే! మా కోసం భోజనం సిద్ధం చెయ్! నేను స్నానం ముగించుకుని



చిన్నాన్న అయిన మార్కుస్‌తో ఛార్లెస్ డార్నే మాట్లాడుట!

వస్తాను." అన్నాడు మార్కుస్.

స్నానం ముగించుకొని వచ్చిన మార్కుస్. బల్లమీద వుంచిన భోజనం వద్ద కూర్చున్నాడు. అతడు కూర్చున్న ఆసనం గోడకిటికీకి ఎదురుగా వుంది. అతడు ద్రాక్ష సారాయాన్ని గ్లాసులో పోసుకొని తాగేందుకు పైకి ఎత్తాడు.

అప్పుడు వెలుపల ఏదో చిన్న చప్పుడైంది.

"ఏమిటది?" అన్నాడు మార్కెస్ ప్రక్కనే నిలుచుని వున్న సేవకుడితో.

"ఏమీ లేదు ప్రభూ! మీరు భోజనం చేయండి!" అన్నాడు సేవకుడు.

మార్కెస్ భోజనం ప్రారంభించాడు. అదే సమయంలో బండి చక్రాల శబ్దం వినిపించింది. ఆ బండి వచ్చి కోటముందు ఆగింది.

కొన్ని నిముషాలు గడిచిన తర్వాత మార్కెస్ సోదరుని కొడుకు అక్కడికి చేరుకొన్నాడు.

మార్కెస్ సోదరుని కొడుకు ఎవరోకాదు: ఛార్లెస్ డార్నే!.... మార్కెస్ అతడ్ని సాదరంగా తోడ్కొని వచ్చి బల్ల ముందు కూర్చుండ బెట్టాడు.

ఛార్లెస్ డార్నే చిన్నాన్నతో ఓ విషయం గురించి చర్చించేందుకు లండన్ నుంచి వచ్చాడు.

"చిన్నాన్నగారూ! నా తల్లి చివరికోరికలను సఫలీకృతం చేసి ఆమె ఆత్మకు శాంతి కలిగించాలని అనుకుంటున్నాను. పేదవారికీ ఆపదలో వున్న వారికీ సహాయం చేయమనీ నిరంకుశంగా ప్రజలను అణగద్రొక్కే పరిపాలనను అంతం చేయడానికి కృషిచేయమనీ, ఆమె చనిపోతూ నన్ను కోరింది. మన వంశానికి ఎంతో పేరు ప్రఖ్యాతులు ఉన్నాయి. కానీ ఆ పేరు ప్రఖ్యాతులను పేద ప్రజలు గౌరవించడంలేదు. ద్వేషభావంతో అసహ్యించుకుంటున్నారు. ఎందుకో తెలుసా? స్వర్గీయ మా నాన్నగారూ, మీరూ, వాళ్ళ యెడల చూపించిన తృణీకార భావమే!.... వాళ్ళను మీరిద్దరూ పురుగులకంటే చాలా హీనంగా చూసారు!— మీ విషయంలో జోక్యం చేసుకున్న పేదవారిని, మీ సుఖసంతోషాలకు వేడుకలకు అడ్డు వచ్చిన నిరపరాధులనూ నిర్దాక్షిణ్యంగా కాలరాచి నాశనం చేసారు." అన్నాడు ఛార్లెస్ డార్నే ఆవేశంగా.

"అయితే నువ్వు చెప్పేదేమిటి?" మార్కెస్ కోపంగా అడిగాడు.

"నేను చెప్పేదేముంది చిన్నాన్నగారూ!.... మీరు అటువంటి క్రూరమైన పనులు మానేయాలి. పేద ప్రజల విషయంలో సామరస్య పూర్వకమైన ధోరణిలో వ్యవహరించాలి. అది మీకు భవిష్యత్తులో ఎంతో మేలు చేస్తుంది. అది చెప్పడానికే నేను వచ్చాను." అన్నాడు డార్నే.

మార్కెస్ మందహాసం చేస్తూ "చూడు ఛార్లెస్! నేను గౌరవంగల ఉన్నత

వంశంలో జన్మించాను. నాకిప్పుడు అరవై సంవత్సరాలు! ఇంతవరకు నా హోదాను, గౌరవాన్ని కాపాడుకుంటూ వస్తున్నాను. నా వంశ గౌరవాన్ని కాపాడుకునేందుకు నేను ఎటువంటి పోరాటానికైనా సిద్ధమే!.... తక్కువ జాతికి చెందిన పేదప్రజలతో చేతులు కలపడం నా వంశ గౌరవానికే కళంకం!.... ఈ విషయంలో అవసరమైతే



ప్రజాకంటకుడైన ధనవంతుడు మార్కుస్‌ను ఎవరో హత్య చేయుట!

నీతో పోరాడటానికైనా నేను సిద్ధమే!" అన్నాడు.

"అలాగైతే యీ ఆస్తి, ఈ ఫ్రాన్స్‌దేశం నన్ను పోగొట్టుకున్నట్టే భావించవలసి ఉంటుంది. నేను వీటిని పోగొట్టుకున్నా బాధలేదు. కష్టపడి పనిచేస్తూ జీవితాన్ని వెళ్ళబుచ్చగలను. నాకు ఆస్తిపాస్తులేవీ అవసరం లేదు. మీ వంశ గౌరవం

నా మూలంగా నాశనం కాదని హామీ యిస్తున్నాను. నా స్వలాభం కోసం మీ వంశ గౌరవాన్ని ఉపయోగించుకోనని వాగ్దానం చేస్తున్నాను-" అన్నాడు ఛార్లెస్‌డార్నే బాధగా.

"చాలామంది ప్రభుత్వానికి భయపడి ఫ్రాన్స్ నుండి ఇంగ్లండ్‌కు పారిపోయారు. అలాగే నువ్వు కూడా ఇంగ్లండ్‌లో స్థిరపడి పోతావన్నమాట!.... అన్నట్టు ఓ డాక్టర్. అతడి కుమార్తె ఇంగ్లండ్‌లోనే ఉంటున్నారట! వాళ్ళు నీకు తెలుసా?" అడిగాడు మార్క్విస్.

డార్నే చిన్నాన్న ముఖంలోకి చూస్తూ "తెలుసు! ఎందుకు అలా అడుగుతున్నారు?" అన్నాడు.

మార్క్విస్, ఛార్లెస్ ప్రశ్నకు జవాబు చెప్పలేదు. భోజనం వద్ద నుండి లేచి తిన్నగా తన గదికి వెళ్ళిపోయాడు. ఛార్లెస్‌డార్నే భారంగా నిట్టూర్చి భోజనం వద్దనుండి లేచాడు.

మార్క్విస్ తన గదిలో చాలాసేపు అటు యిటు పచార్లు చేస్తూనే ఉన్నాడు. ఆ రోజు జరిగిన సంఘటనలు అతడికి నిద్ర పట్టకుండా చేసాయి. అర్ధరాత్రి దాటిన తర్వాత కాని మార్క్విస్‌కి నిద్రపట్టలేదు.

ఆ అర్ధరాత్రి నిశ్శబ్ద వాతావరణంలో చీకటిని చాటు చేసుకుని ఒక వ్యక్తి కోటగోడ మీదికి ఎగబ్రాకటం ఎవరూ చూడలేదు.... ఆ చీకటి మనిషి కోట లోపలికి ప్రవేశించడం రహస్యంగానే ఉండి పోయింది.

తూరుపు తెల్లవారింది! సేవకులు మార్క్విస్ ప్రభువును నిద్రలేపేందుకు అతడి శయన మందిరంలో అడుగుపెట్టారు.

మార్క్విస్ ప్రభువు మంచం మీద పడుకుని ఉన్నాడు. అతడి కళ్ళు భయంతో తెరుచుకుని ఉన్నాయి. ముఖంలో భయాందోళనలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. అతడి శరీరంలో చలనం లేదు. పదునైన పొడవాటి బాకు ఒకటి మార్క్విస్ గుండెలో పిడి వరకూ దిగబడి ఉంది. ఆ పిడికి, ఒక కాగితం ముక్క కట్టబడి ఉంది.

ఆ కాగితం మీద యిలా రాసి ఉంది :

"ఇతడు తన అంతిమ యాత్రకు సిద్ధంగా ఉన్నాడు. ఇతడి సమాధి వరకూ వెళ్ళేందుకు సహాయం చేయండి. ఇట్లు జాక్వెస్."

5

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచిపోయింది. చిన్నాన్నతో తెగతెంపులు చేసుకుని తిరిగి ఇంటికి వచ్చిన ఛార్లెస్ డార్నే చాలా కష్టాలు అనుభవించాడు. అయినా ఓ మంచి ఉపాధ్యాయుడిగా, ఫ్రెంచ్ భాషలో అనువాదకుడిగా జీవితంలో స్థిరపడ్డాడు.

తరుచూ డాక్టర్ మేనెటు ఇంటికి రాకపోకలు సాగించడంలో మిస్ లూసీని ప్రేమించడం ప్రారంభించాడు. అయినా ఆ విషయాన్ని ఆమె ముందు ఎన్నడూ ప్రస్తావించలేదు.

తమ ప్రేమ విషయాన్ని డాక్టర్ మేనెటు వద్ద ప్రస్తావించడం మంచిదని, ఛార్లెస్ డార్నే నిశ్చయించుకున్నాడు. అనుకున్నట్టుగానే ఒకనాడు ఆ యువకుడు తన ప్రేమ విషయాన్ని డాక్టర్ ముందు ప్రస్తావించాడు.

అది విన్న డాక్టర్ మేనెటు ఇబ్బందిగా ముఖంపెట్టి "ఆమె విషయంలో నీ ప్రేమ ఎటువంటిదో నేను గ్రహించగలను. అయితే నీ ప్రేమను లూసీ ముందు వ్యక్తం చేసావా?" అన్నాడు.

"లేదండీ! ఈ విషయాన్ని ముందుగా మీకు మనవి చేయడం ఉచితమని భావించాను. ఈ విషయంలో మిస్ లూసీ ప్రేమను పొందడానికి మరొకరు సిద్ధంగా ఉన్నారు" అన్నాడు డార్నే.

"అవును! మిస్టర్ కార్టన్ తరుచూ వచ్చి మమ్మల్ని కలుసుకుంటూనే ఉన్నాడు."

"మీకు మరొక విషయం చెప్పాలని అనుకుంటున్నాను-" అన్నాడు డార్నే.

"ఏమిటది?" అడిగాడు డాక్టర్ మేనెటు.

"నా అసలు పేరు గురించి!....నేను ఎందుకు ఫ్రాన్స్ నుంచి ఇంగ్లండ్ వచ్చేసానో దాని గురించి!...." అన్నాడు ఛార్లెస్ డార్నే.

"ఆగు!—ఆ విషయాల గురించి ఇప్పుడు తెలుసుకోవాలన్న కోరిక నాకు లేదు. నువ్వూ, లూసీ వివాహం చేసుకునేరోజున, ముందుగా ఆ విషయాలు నాకు తెలియజెయ్!.... లూసీ బయటికి వెళ్ళింది. వచ్చేవేళ అయింది. నువ్వింక వెళ్ళవచ్చు" అన్నాడు డాక్టర్ మేనెటు.

ఛార్లెస్ డార్నే ఏమీ మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయాడు.

సిడ్నీ కార్టన్ పరిస్థితిలో ఎటువంటి మార్పూ లేదు. ఎప్పుడూ తాగ

డం.... నిర్లక్ష్యంగా తిరగడం మాత్రం మానలేదు. అయితే అతడు మిస్ లూసీ మేనేటు ఇంటికి వెళ్ళేటప్పుడు మాత్రం తాగకుండా వెళ్ళేవాడు.... అతడి హృదయంలో లూసీ చోటుచేసుకుంది. అతడామెను గాఢంగా ప్రేమించసాగేడు. అయితే ఆ విషయాన్ని అతడు కూడా లూసీ ముందు ఎన్నడూ వెల్లడిచేయలేదు.



సిడ్నీ కార్టన్ తన ప్రేమ విషయాన్ని లూసితో చెప్పి ఆమె చేతిని ముద్దాడుట!

అంతేగాకుండా తనవంటివాడు ఆమె ప్రేమకు అర్హుడుకాడన్న విషయం సిడ్నీకార్టన్‌కి తెలియని విషయంకాదు.

ఒకనాడు సిడ్నీకార్టన్, డాక్టర్‌గారి ఇంటికొచ్చాడు. మిస్ లూసీ ఒక్కతే

ఇంటిలో వుంది. ఆమె కార్టన్‌ని ఆహ్వానించింది.

తన ప్రేమ విషయం చెప్పాలా! వద్దా! అన్న ఆలోచనలో కార్టన్ మనసు ఆందోళనకు గురైంది.

"మీ ఆరోగ్యం ఏమంత బాగున్నట్టులేదు మిస్టర్ కార్టన్!" అంది లూసీ.

"అదేంకాదు! నా జీవిత విధానమే అంత మిస్ లూసీ!" అన్నాడు కార్టన్.

అతడి జీవిత విధానమెటువంటిదో తెలిసిన లూసీ నవ్వి "ఇలా అంటున్నందుకు నన్ను క్షమించండి....అన్నీ తెలిసి కూడా మీ జీవిత విధానాన్ని దేనికి మార్చుకోరు?" అని ప్రశ్నించింది.

కార్టన్ నవ్వి "ఏం చేయను మిస్ లూసీ! ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది....చాలా లోతుకు మునిగిపోయాను— అది సరే! నేనొక విషయాన్ని నీతో చెప్పాలనుకుంటున్నాను. దయచేసి అదేమిటో వినగలవా మిస్ లూసీ?" అన్నాడు.

మిస్ లూసీ నవ్వి "తప్పకుండా! దానివలన మీకు సంతోషం కలుగుతుందంటే, తప్పకుండా వింటాను" అంది.

"చూడు లూసీ! నీముందు ఎందుకూ పనికిరాని ఓ ప్రాణి నిలబడి వుంది. ఉపయోగంలేని తాగుబోతు ప్రాణి అది!—ఆ నిరర్థకుడు నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాడు. కానీ నీకు ప్రేమను అందించలేడు. దుఃఖాన్ని, బాధల్ని తప్ప ఏమీ యివ్వలేడు" అన్నాడు మిస్టర్ కార్టన్ ఆవేదనగా.

మిస్ లూసీ కార్టన్ వంక అదోలా చూస్తూ "ఏ విధంగానూ నేను నీకు సహాయం చేయలేకపోతున్నందుకు చాలా విచారిస్తున్నాను మిస్టర్ కార్టన్!

"ఇంతకంటే యింకేం సహాయం చేయాలి మిస్ లూసీ! ముడుచుకుపోయిన నా హృదయాన్ని నీ ముందు విప్పి చెప్పడానికి నువ్వు అవకాశమిచ్చావు. అంతే చాలు! అయితే మరొక సహాయం చేయగలవా మిస్ లూసీ?"

"ఏమిటది మిస్టర్ కార్టన్!" మిస్ లూసీ అడిగింది.

"మరేంలేదు. నా విషయాన్నిగానీ, నా ప్రేమ వ్యవహారాన్నిగానీ ఎవరి ముందూ వెల్లడించనని నాకు మాట యివ్వాలి" అన్నాడు సిడ్నీ కార్టన్.

"మాట యిస్తున్నాను!" అంది మిస్ లూసీ.

"నీకు నా అభినందనలు మిస్ లూసీ! ఈ విషయంలో ఇకమీదట ఎప్పుడూ నిన్ను బాధపెట్టను. నువ్వు ఎప్పుడూ చూసే పాత సిడ్నీ కార్టన్‌గా కాకుండా ఓ

కొత్త సిడ్నీ కార్టన్‌గా నన్ను జ్ఞాపకముంచుకో మిస్ లూసీ! అవసరం వచ్చినప్పుడు నీకోసంగానీ, నీకు ప్రియమైన వారికోసంగానీ యీ సిడ్నీ కార్టన్ తన ప్రాణాలను ధారపోయడానికి గూడ వెనుదీయడు! గుర్తుంచుకో!"

సిడ్నీ కార్టన్ మిస్ లూసీవద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

## 6

సెయింటు ఆంథోనిలోవున్న తన బ్రాందీషాపు కౌంటర్‌లో కూర్చుని మేడమ్ డిఫార్జు లేసు అల్లుకుంటున్నది. బ్రాందీషాపులో చాలామంది కూర్చుని ద్రాక్ష సారాయం సేవిస్తున్నారు.

మేడమ్ డిఫార్జు లేసు అల్లుతున్నా ఆవిడ చూపులు షాపులో కూర్చున్న వ్యక్తులమీదనే వుంది. ఆమెలో షాపులో ఉన్నంతసేపు చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తూ ఉంటుంది. ఎందుకంటే సెయింటు ఆంథోనీ ప్రాంతంలో రాజుగారి గూఢచారులు సమాచార సేకరణకు తరచూ వస్తూ ఉంటారు.

అదే సమయంలో ఎక్కడికో వెళ్ళిన ఎర్నెస్ట్ డిఫార్గ్ షాపులోకి వచ్చాడు. అతని వెంట పొడవాటి వ్యక్తి ఒకడు వచ్చాడు.

అతడెవరోకాదు. చనిపోయిన మార్కుస్‌తో అతడి బండి క్రింది భాగానగల గొలుసు మీద ఎవరో వ్యక్తి ప్రయాణం చేస్తూ రావడం చూసానని చెప్పిన వ్యక్తే అతడు!

"ఈ యువకుడు నేను గ్రామం వెళ్ళి తిరిగి వస్తుండగా మార్గ మధ్యంలో కలిసాడు." అని చెప్పాడు డిఫార్గ్ తన భార్యతో.

ఆ యువకుడు అక్కడే భోజనం చేసాడు.

"మనం బ్రాందీషాపు వెనుకగా వున్న గది దగ్గరకు వెళ్ళి మాట్లాడుకుందాం, పద!" అన్నాడు డిఫార్గ్ ఆ యువకుడితో.

అంతకు క్రితమే షాపులో కూర్చున్న ముగ్గురు వ్యక్తులు లేచి బయటికి వెళ్ళిపోయారు.

డిఫార్గ్ ఆ వ్యక్తిని తీసుకొని షాపు వెనుక భాగానికి వెళ్ళాడు. అక్కడున్న మెట్లెక్కి వాళ్ళు పై అంతస్థుకు చేరుకొన్నారు. అంతకు క్రితం షాపు నుండి బయటికి వచ్చిన ముగ్గురు వ్యక్తులు అక్కడ గది వెలుపల వాళ్ళరాకకోసం ఎదురు చూస్తూ నిలుచున్నారు.

డిఫార్గ్ గది తలుపులు తెరిచాడు. అంతా లోనికి వెళ్ళారు. ఆ గదిలో

ఒకప్పుడు డాక్టర్ మేనెటు ఉండేవాడు.

“కావలసిన వాళ్ళం ఇక్కడ ఉన్నట్లే! కొత్తగా వచ్చిన 'జాక్విస్' ఏం చెబుతాడో విందాం!” అన్నాడు డిఫార్జ్.

'జాక్విస్' అనే పేరు విప్లవకారులు వాడే రహస్యనామం! .... వాళ్ళు ఆ



డిఫార్జ్ నలుగురు వ్యక్తులతో రహస్య సమావేశం జరుపుట.

పేరుతో వ్యవహరింపబడుతూ తమను తాము గుర్తించుకుంటారు.

అలా కొత్తగా వచ్చిన 'జాక్విస్' ఎవరో కాదు. లోగడ గ్రామం వద్ద మార్క్వస్‌ను కలుసుకొని బండి క్రింద ఎవరో ప్రయాణం చేసి రావడం చూసానన్న వ్యక్తే!

"నేను ఒక సంవత్సరం క్రితం గాస్‌ఫర్డ్‌ని చూసాను. అతడు గుర్రపు బండి క్రింద వ్రేళ్ళాడుతున్న గొలుసు పట్టుకొని, వస్తూ కనిపించాడు. అతడు మార్క్విస్‌ని చంపుతాడని అప్పట్లో నేను భావించలేదు." అన్నాడు కొత్తగా వచ్చిన జాక్విస్.

"ఆ తర్వాత గాస్‌ఫర్డ్‌ని ఎప్పుడైనా తిరిగి చూసావా?" అని అడిగాడు అందులోని ఒక వ్యక్తి అతడి రహస్య నామం. జాక్విస్ రెండు.

"చూసాను. రాజుగారి సైనికులు గాస్‌ఫర్డ్‌ని పట్టుకొని పెడరెక్కలు విరిచి కట్టితీసుకు వెళ్ళడం చూసాను. గాస్‌ఫర్డ్ కొడుకు మార్క్విస్ బండి క్రింద పడి మరణించినరోజు రాత్రి మార్క్విస్ హత్య జరిగినందు వలన అది గాస్‌ఫర్డ్ చేసాడని అధికారులు భావించి ఉంటారు. ఆ తర్వాత నలభై అడుగుల ఎత్తుగల ఉరికంభానికి అతడ్ని వ్రేళ్ళాడ దీసారని మాత్రం విన్నాను." అంటూ అతడు వేలెత్తి డిఫార్జ్ వంక చూపించి నేను ఆ విషయాన్ని జాక్విస్‌కి తెలియజేయాలని ఆ రోజునే నిశ్చ యించుకున్నాను." అని చెప్పాడు.

అది విన్నవాళ్ళ కళ్ళల్లో ద్వేషం పగ పెల్లుబికి వచ్చాయి.

"నువ్వు తిరిగి నీ ప్రాంతానికి వెళ్ళు. రహస్య సమాచారం సేకరించి ఎప్పటి సంగతులు అప్పుడు మాకు తెలియజేస్తూ వుండు" అని కొత్తగా వచ్చిన జాక్విస్‌తో చెప్పారు.

"ఈ విషయాన్ని మనం మన రహస్య ఖాతా పుస్తకంలో రాసుకో వచ్చునా?" అని డిఫార్జ్‌ని అడిగాడు జాక్విస్ మూడు.

"తప్పకుండా! గాస్‌ఫర్డ్‌ని ఉరితీసిన సంఘటన మన విప్లవానికి నూతనోత్సాహాన్ని యిస్తుంది. కులీనుల నాశనానికి బలాన్ని చేకూరుస్తుంది." అన్నాడు డిఫార్జ్.

"ఇటువంటి సంఘటనలు మన రిజిష్టర్‌లో రాసుకోవడంవల్ల ప్రభుత్వ అధికారుల దృష్టిలో పడతామేమో ఆలోచించారా?" అన్నాడు జాక్విస్ మూడు.

డిఫార్జ్ నవ్వి "మనం రాసినా రాయకపోయినా ఫర్వాలేదు. నేరస్థుల పేర్లు ఎవరిని ఉరితీయాలి? అనేది మేడమ్ డిఫార్జ్ మెదడులో లిఖించబడే ఉంటాయి. ఆమె ఎప్పుడూ లేసు అల్లుతూనే వుంటుంది. అది గమనించావా నువ్వు? అదేమి టనుకున్నావు. ఆమె అల్లేది మామూలు స్వెట్టర్ కాదు. నేరస్థుల పేర్లు కులీనుల పేర్లు

రాజవంశీయులపేర్లు ఆ లేసులో రహస్యమైన 'కోడ్'లో అల్లుతూ ఉంటుంది. ఎవరూ ఆమెదృష్టి నుండి తప్పించుకుపోలేరు. గుర్తుంచుకో!" అన్నాడు.

బ్రాందీ షాపు నుండి వచ్చిన ముగ్గురు జాక్విస్‌లలో ఒకడు యిలా చెప్పాడు. "నా స్నేహితుడొకడు రక్షకభటుడుగా పని చేస్తున్నాడు. అతడు



జాన్ బర్సడ్ అనేవాడు వచ్చి మేడమ్ డిఫార్గ్ నుండి రహస్య సమాచారం సేకరించాలని ప్రయత్నించుట!

చెప్పిన రహస్య సమాచారం ఏమిటంటే యీ ప్రాంతానికి ఒక కొత్త గూఢచారిని అధికారులు నియమించారట."

ఆ విషయాన్ని డిఫార్గ్ తన భార్యతో చెప్పాడు. కొత్తగా వస్తున్న గూఢ

చారి ఆకార విశేషాలను వర్ణించి చెప్పాడు.

"ఆ గూఢచారి ఇంగ్లీషు జాతీయుడట! పేరు జాన్ బర్సడ్!" అని చెప్పాడు డిఫార్జ్.

మేడమ్ డిఫార్జ్ ఆలోచిస్తూ "ఎవరూ? జాన్‌బర్సడ్! ఆఁ.... హాఁ....! సరే! ఆతడి పేరు కూడా నా మెదడులో లిఖించాను" అంది.

ఆ మర్నాడు జాన్‌బర్సడ్ బ్రాందీషాపుకు వచ్చాడు. మేడమ్ డిఫార్జ్ మామూలు ప్రకారం లేసు అల్లుతూ కౌంటర్‌లో కూర్చుని ఉంది.

ఏదో విధంగా ఆమెను పలుకరించాలని జాన్‌బర్సడ్ సంభాషణ యిలా ప్రారంభించాడు.

"మీరు ఎప్పుడు చూసినా లేసు అల్లుతూనే కనిపిస్తారు. ఎందుకని?"

"ఖాళీగా కూర్చోలేక కాలక్షేపానికి ఏదో అల్లుతూ ఉంటాను." అంది మేడమ్ డిఫార్జ్ అతడి పేరును లేసుమీద అల్లుతూ.

"మీ బ్రాందీ వ్యాపారం జోరుగా లేనట్టు కనిపిస్తున్నది. బహుశా ప్రజలు పేదవారు కావడం.... అధికారుల చేత అణగద్రొక్కబడటం వల్ల మీ వ్యాపారం మందగించి ఉంటుందని భావిస్తున్నాను." అన్నాడా గూఢచారి.

మేడమ్ డిఫార్జ్‌కి సమాధానం ఎలా చెప్పాలో తోచక "ఓ! అవి కారణాలని మీరు భావిస్తున్నారా?" అంది.

మేడమ్ డిఫార్జ్ నుండి తనకు కావలసిన సమాధానం రాకపోయేసరికి "పాపం అమాయికుడైన గాస్‌పర్డ్ విషయమే తీసుకుందాం! అతడు మార్క్విస్‌ని చంపాడో లేదో ఎవరికీ తెలియదు. అయినా అతణ్ని అనుమానం మీద పట్టుకుని విచారణ లేకుండా ఉరితీయడం ఘోరాతి ఘోరం" అంటూ సానుభూతి చూపించాడు.

మేడమ్ డిఫార్జ్ క్రోధాన్నీ, బాధనూ తనలో అణచుకుని "అతడు ఆవేశంలో హత్య చేసాడని నేను భావిస్తున్నాను. దాని ఫలితాన్ని అతడు అనుభవించాడు. ఇందులో ఎవరి దోషమూ లేదు." అంది.

"అతడంటే ఈ ప్రాంతంలోని ప్రజలకు ఎంతో సానుభూతి, దయ, జాలి ఉన్నట్టు నేను భావిస్తున్నాను." అన్నాడు గూఢచారి.

అదే సమయంలో ఎర్నెస్ట్ డిఫార్జ్ షాపులో అడుగుపెట్టాడు.

మేడమ్ డిఫార్జ్ తేలికగా ఊపిరి పీల్చుకుని "అడుగో నా భర్త వచ్చాడు."

అంది.

గూఢచారి తలతిప్పి లోపలికి వస్తున్న డిఫార్గ్‌ని చూసి నెత్తిమీదున్న టోపీని తీసి "మీకు శుభదినం జాక్విస్!" అన్నాడు నవ్వుతూ.

"మీరు పొరబడుతున్నారు. నా పేరు అదికాదు. నా పేరు ఎర్నెస్ట్ డిఫార్గు!" అన్నాడు శాంతంగా.



జాన్‌బర్సడ్, మిస్టర్ గాస్‌ఫర్డు విషయమై డిఫార్గుని అడుగుట!

"మంచిది!.... ఇంతవరకు మీ అర్ధాంగితో మాట్లాడుతూ ఒక విషయాన్ని తెలుసుకున్నాను. అదేమంటే మిస్టర్ గాస్పర్డు అంటే యీ ప్రాంతంలో చాలా సానుభూతి జాలి ఉందని!" అన్నాడు గూఢచారి డిఫార్గ్ ముఖంలోకి సూటిగా చూస్తూ.

"ఈ ప్రాంతంలోని విశేషాలు నాకంటే మీకే ఎక్కువ తెలుసుననుకుంటానే! అన్నాడు డిఫార్జు నవ్వుతూ

"నాకు జ్ఞాపక శక్తి ఎక్కువ! అన్నట్టు మీరు వయసులో ఉన్నప్పుడు డాక్టర్ మేనెట్ వద్ద సేవకుడిగా పనిచేసారు కదూ! వాళ్ళు డాక్టర్ మేనెట్‌ని జైలు నుండి తీసుకొచ్చి మీకు అప్పగించారు. డాక్టర్ మేనెట్ ఇంగ్లండ్ వెళ్ళేందుకు సహాయం చేసిన వారిలో మీరూ ఒకరు! అవునా?" అన్నాడు గూఢచారి.

"అది అందరికీ తెలిసిన యధార్థ విషయమే కదా!" అన్నాడు డిఫార్జ్.

"అవునవును! ఆ విషయం నాకూ తెలుసు! అన్నట్టు ఇంగ్లండ్‌లో ఉన్న డాక్టర్ గురించీ అతని కూతురు లూసీ గురించీ మీకేమైనా వార్తలు తెలుస్తున్నాయా?" అని గూఢచారి ప్రశ్నించాడు.

"లేదండీ! వాళ్ళు ఇంగ్లండ్ వెళ్ళిన తర్వాత నేను వాళ్ళ గురించి పట్టించుకోవడం మానేసాను."

"డాక్టర్ మేనెట్ కూతురు ఫ్రెంచి జాతీయుడైన ఓ యువకుడ్ని వివాహం చేసుకోబోతున్నదట కదా!.... ఇంగ్లండ్‌లో స్థిరపడిన ఆ ఫ్రెంచి యువకుడి ఇంగ్లీషు పేరు ఛార్లెస్ డార్నే అనీ, గాస్‌ఫర్డు చంపిన మార్క్విస్ ఆ యువకుడికి చిన్నాన్న అవుతాడనీ తెలిసింది." అన్నాడు జాన్‌బర్సడ్.

ఆ తర్వాత అతడు వాళ్ళ వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

డిఫార్జు వణుకుతున్న చేతులను ముఖంలోని భయాన్ని అదుపులో పెట్టుకుని "అతడు చెప్పింది నిజమే అయి ఉంటుందా? అని భార్యను ప్రశ్నించాడు.

ఆమె స్థిమితంగా లేసు అల్లుకుంటూ "అతడు చెప్పింది నిజంకావచ్చు.... కాకనూపోవచ్చు" అంది.

"అదే నిజమైతే లూసీ మేనెట్ కారణంగా మనం బ్రతికి ఉండగానే అంటే మన జీవితకాలంలోనే విప్లవం రావడం తథ్యం! ఆమె భర్త ఫ్రాన్స్‌నుండి వెళ్ళడం ఏమంత మంచిదికాదు" అన్నాడు డిఫార్జు.

మేడమ్ డిఫార్జు భర్త కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "ఎక్కడికి వెళ్ళాలంటే అక్కడికి వెళ్ళే హక్కు లూసీ భర్తకు ఉంది" అన్నది.

"మనకు డాక్టర్ మేనెట్‌మీదా అతని కూతురుమీదా దయ, జాలి, సానుభూతి అపారంగా వుంది. అయితే లూసీ భర్తమీద ద్వేషం దేనికి? విప్లవకారులు ఉరితీసే కులీనుల జాబితాలో లూసీ భర్తపేరు దేనికి లిఖించావు?....దానిని సానుభూతి

అంటారా?" అన్నాడు డిఫార్జు కోపంగా.

మేడమ్ డిఫార్జు అల్లుతున్న లేసును ఉండగా చుట్టి ప్రక్కన పడేసింది. ఆమె కళ్ళల్లోకూడ క్రోధం కొట్టొచ్చినట్టు కనిపిస్తూన్నేవుంది.



ఓ చిన్న చర్చిలో ఛార్లెస్ డార్నేకు, లూసీకి అతి నిరాడంబరంగా వివాహం జరుగుతుంది!

## 7

లండన్ నగరంలోని సోహో స్క్వేర్‌లోవున్న చిన్న చర్చిలో ఛార్లెస్ డార్నే, మిస్ లూసీ మేనెట్‌ల వివాహం అతి నిరాడంబరంగా జరిగిపోయింది. ఆ వివాహానికి డాక్టర్ మేనెట్, మిస్టర్ లారీ, మిస్ ప్రాస్ తప్ప మరెవ్వరూ హాజరు

కాలేదు.

వివాహం జరిగేరోజు ఉదయం చార్లెస్ డార్నే, డాక్టర్ మేనెట్ రహస్యంగా సమావేశం జరిపారు. వాళ్ళు తిరిగి గదినుండి బయటికి వచ్చినప్పుడు డాక్టర్ ముఖంలో భయాందోళనలు స్పష్టంగా కనిపించాయి. అది మిస్టర్ లారీ కనిపెట్టక పోలేదు.

అటువంటి భయాందోళనలే దంపతులు హనీమూన్‌కి వెళ్ళేటప్పుడు మిస్టర్ లారీ, డాక్టర్ మేనెట్ ముఖంలో తిరిగి చూసాడు.

హనీమూన్ హాయిగా గడిపి దంపతులు తిరిగి సోహోస్క్వేర్‌కి వచ్చారు. హనీమూన్‌నుంచి తిరిగి వచ్చిన నూతన దంపతులను పరామర్శించేందుకు వచ్చిన మొదటి వ్యక్తి సిడ్నీ కార్టన్.

చార్లెస్ డార్నే కేసు కోర్టులో జరుగుతున్నరోజు రాత్రి బాగా తప్ప తాగినందుకు సిడ్నీ కార్టన్, తనని క్షమించవలసిందంటూ డార్నేని కోరాడు. అంతేకాదు తనని స్నేహితుడిగా స్వీకరించవలసిందని కూడా అభ్యర్థించాడు. కుటుంబ స్నేహితుడిగా తరచూ వచ్చి వారిని కలుసుకోవడం తనకు ఎంతో తృప్తిగా ఉంటుందనీ అందుకు హృదయపూర్వకంగా అంగీకరించవలసిందనికూడా అర్థించాడు. అతడి కోరికలను చార్లెస్ డార్నే, మిసెస్ లూసీ సంతోషంగా అంగీకరించారు.

ఆరోజు మధ్యాహ్నం భార్యాభర్తలిద్దరూ ఏకాంతంగా ఉన్నప్పుడు లూసీ చార్లెస్‌తో యిలా అంది : "సిడ్నీ కార్టన్ చాలా గొప్ప వ్యక్తి. గొప్ప పనులు చేయగల సమర్థుడు. అయితే అతడిలో కొన్ని బలహీనతలు ఉన్నాయి. తరచూ మనసులోని భావాలను బయటికి వెళ్ళగ్రక్కుతూ ఉంటాడు" అని.

దానికి చార్లెస్ ఎటువంటి సమాధానం చెప్పలేదు.

ఈ మధ్యకాలంలో మిసెస్ లూసీ గర్భం ధరించి ఓ ఆడపిల్లను ప్రసవించింది. ఆ చిన్న లూసీ నడవడం, మాట్లాడే వయసుకు చేరుకుంది.

సిడ్నీ కార్టన్ రోజూ డాక్టర్‌గారి ఇంటికి రావడం ప్రారంభించాడు. చిన్న లూసీ, సిడ్నీ కార్టన్‌కి బాగా చేరువైంది. 'అంకుల్ సిడ్నీ' అని పిలువసాగింది. చిన్న లూసీని చూడనిదే ఉండలేనంత ప్రేమను పెంచుకున్నాడు సిడ్నీ కార్టన్.

ఆ విధంగా ఆరు సంవత్సరాలు గడిచిపోయాయి. అది 1789వ సంవత్సరం.

ఒకనాటి రాత్రి మిస్టర్ లారీ, డాక్టర్ మేనెట్ ఇంటికి వచ్చాడు. చార్లెస్ డార్నే, మిసెస్ లూసీ డాక్టర్ మేనెట్ ఇంటిలోనే ఉన్నారు.

"ఇంత రాత్రివేళ వచ్చారు. ఏమిటి విషయం?" అన్నాడు డాక్టర్ మేనెట్ నవ్వుతూ.

"మీకొక దుర్వార్త చెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. అదేమంటే, ఫ్రాన్స్‌లో విప్లవమనే అగ్నిపర్వతం బ్రద్దలైంది. పీడిత ప్రజలు విప్లవాన్ని అనుసరిస్తూ సర్వనాశనం చేస్తున్నారు" అని చెప్పాడు మిస్టర్ లారీ.

8

ఫ్రాన్స్ భూభాగంలోని సెయింట్ ఆంథోనీ ప్రజలు ఆయుధాలు చేతబట్టి విప్లవానికి శ్రీకారం చుట్టారు. తుపాకులు, తుపాకి గుళ్ళు, తుపాకి మందు, ఇనుప కడ్డీలు, పిడిబాకులు, గొడ్డళ్ళు సిద్ధం చేసుకున్నారు.

ఆయుధాలు లేని సామాన్య పేదప్రజలు తమకు అందుబాటులో ఉన్న రాళ్ళు, ఇటుకలు గోడలను తవ్వి వెలికి తీసారు. అవే వారికి ఆయుధాలయ్యాయి.

సామాన్య ప్రజల ఆగ్రహం రాజు మీదా, కులీనులైన ధనవంతుల మీదా పెల్లుబికి, శిఖరాగ్రానికి చేరుకుంది.

ఆయుధాలు ధరించిన ప్రజలు, ఎర్నెస్ట్ డిఫార్జ్ బ్రాందీ షాపుచుట్టూ పెద్ద సంఖ్యలో గుమిగూడేరు.

ఎర్నెస్ట్ డిఫార్జ్ అందరికీ ఆయుధాలు పంచిపెట్టసాగేడు. చెమటతోనూ, తుపాకి మందుతోనూ అతడి శరీరం యావత్తూ నిండిపోయింది. ఎంతమంది ఎటు వెళ్ళాలో, ఎవరేం చేయాలో ఓ మిలిటరీ కమాండర్‌లాగ అతడు ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు.

"ఇదుగో జాక్విస్ మూడు....నువ్వు నా వెనుకనే ఉండు. జాక్విస్ ఒకటి, జాక్విస్ రెండు.... మీరిద్దరూ దేశభక్తులను, విప్లవకారులను తీసుకుని చెరొకవేపు వెళ్ళండి. ఏం చేయాలో మీకు తెలుసు కదా!...." వాళ్ళకు డిఫార్జ్ ఆజ్ఞలు జారీ చేసాడు.

మేడమ్ డిఫార్జ్ చేతిలో ఇప్పుడు లేసు అల్లకం లేదు. ఒక చేతిలో పిస్టల్, రెండవ చేతిలో గొడ్డలి ఉంది.

అది చూసిన డిఫార్జ్ ఆశ్చర్యపోతూ "ఆయుధాలు తీసుకుని ఎక్కడికి బయలుదేరావు?" అని భార్యను ప్రశ్నించాడు.

"ప్రస్తుతం నీతోబాటే శత్రుసంహారానికి వస్తున్నాను. ఆ తర్వాత స్త్రీ జనానికి నాయకత్వం వహిస్తాను" అంది మేడమ్ డిఫార్జ్.

"అయితే పద! నేనూ, నా స్నేహితులైన దేశభక్తులూ ముందుగా బాస్టిల్లీ మీదికి దండెత్తి వెళుతున్నాం."



విప్లవం ప్రారంభమైంది. ప్రజలు ఆయుధాలు చేతబట్టి ధనవంతుల మీదికి, యుద్ధానికి బయలుదేరుట!

పెద్దగా కేకలు పెడుతూ, ఆయుధాలు ఝళిపిస్తూ ప్రజలు పెద్ద గుంపుగా చేరి, ఆకలిగొన్న సింహాల్లా, ఆవేశంతో ముందుకు బయలుదేరారు. ప్రతి విప్లవకారుడి కళ్ళల్లో ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతోంది. రాజభక్తులనూ, కులీనులైన ధనవంతులూ,

అధికార మదంతో పేద ప్రజలను పీడించిన అధికారులను బ్రతకనీయకూడదన్న దృఢసంకల్పం వాళ్ళలో వ్రేళ్ళు నాటుకుపోయి ఉంది.

ఆ పేద ప్రజలు కేకలు పెడుతున్నారు. కత్తులు ఝుళిపిస్తున్నారు. పెద్దగా జేగంటలు మోగిస్తున్నారు. యుద్ధభేరీలు వాయిస్తూ వెళుతున్నారు.

పోరాటం ప్రారంభమైంది. ఆకలి బాధలతో అలమటించి పోయిన పేద ప్రజలు, సుఖభోగాలలో మునిగితేలుతూ, తమని పట్టించుకోని ధనిక వర్గంమీద సాగించిన విప్లవ పోరాటం అది!

ఆ పోరాటంలో ధనికవర్గం తాలూకు ప్రజలు ఎందరో మరణించారు. ఆ యుద్ధంలో డిఫార్గ్ విప్లవ వీరులకు నాయకత్వం వహించి అసలు సిసలు సైనికుడి వలె యుద్ధం చేసాడు.

"రండి, రండి! వీర నారీమణులారా! మగవారి కంటే ఎక్కువగానే మనం పోరాడగలమని నిరూపించండి! సాధ్యమైనంతమంది శత్రువులను చంపండి!....మీ కక్ష సాధించుకోండి!" అంటూ మేడమ్ డిఫార్గ్ ఆడవాళ్ళను ప్రోత్సహించసాగింది.

బాస్టిల్లీ జైలులో లొంగిపోయినట్టు అధికారులు తెల్లజెండా ఎగురవేసారు. ఖైదీలను హింసించి చంపడంలో అగ్రస్థానం వహించిన బాస్టిల్లీ జైలులోని ఎనిమిది ప్రఖ్యాతిగాంచిన టవర్లు, విప్లవకారుల స్వాధీనమయ్యాయి. డిఫార్గ్ జాక్విస్ మూడుతో జైలు ఆవరణలోనికి అడుగుపెట్టాడు. వాళ్ళ వెనుకగా వచ్చిన గుంపు పెద్దగా అరుస్తూ జయజయధ్వానాలు చేసారు.

"జైలులో మ్రగ్గిపోతున్న దేశభక్తులను విడుదల చేయండి"

"జైలులోవున్న రికార్డులను తగులబెట్టండి!"

"ఖైదీలను చిత్రహింసలు పెట్టేపనిముట్లనూ ఉపకరణాలను నాశనం చేయండి!"

"చీకటి గదులను ధ్వంసం చేయండి"

ప్రజలు సంతోషంతో అరుస్తూనే వున్నారు!

డిఫార్గ్ జైలులో కాపలా వుండే ఒకగార్డు చొక్కా పుచ్చుకుని ముందుకు లాగి "నార్త్‌టవర్‌లో వున్న '105 సెల్' చూపించు" అంటూ ఆజ్ఞాపించాడు.

గార్డుముందు బయలుదేరాడు. ఆ వెనుక డిఫార్గ్! అతడ్ని జాక్విస్ మూడు అనుసరించాడు. సన్నని మార్గాలు చీకటి గదులు మసక వెలుతురుతో వున్న రహస్య ప్రదేశాలు దాటుకుంటూ చివరకు వారొక మసక వెలుతురున్న నెంబరు

105 సెల్‌లోనికి అడుగుపెట్టారు. ఆ గదిలో ఎత్తైన గోడకు ఒక చిన్న కిటికీ మాత్రమే వుంది. గదిలో ఒక మూలగా గడ్డిపరచిన పరుపు వుంది. దానికి కుడివేపున ఒకబల్ల కూర్చునేందుకు ఒకస్టూలు వున్నాయి. గదిగోడలు నల్లగా మసిపట్టి ఉన్నాయి. గదిలో ఒకచోట పొగ బయటికి వెళ్ళడానికి వీలుగా చిన్న చిమ్నీ



డిఫార్గ్ కాగడా వెలుతురులో జైలులోని ఒక గది గోడవెదుకుట.

వుంది.

'ఇది జైలులోని ఖైదీ ఉండే గదికాదు. నరకంలోని మృత్యుమందిరం!' అనుకున్నాడు డిఫార్గు.

"నీ చేతిలోవున్న టార్చిలైటును గోడమీదికివేసి నెమ్మదిగా ముందుకు

కదిలించు" అన్నాడు డిఫార్జ్ గార్డుతో.

గార్డుటార్చిని వెలిగించి గోడమీదికివేసి నెమ్మదిగా ముందుకు పోనిచ్చాడు.

టార్చి వెలుగులో గోడను నిశితంగా పరిశీలిస్తున్న డిఫార్జ్.

"ఆగు! టార్చిని కదపకుండా ఉంచు!" అని డిఫార్జ్ గార్డును ఆజ్ఞాపించి గోడవేపు చేయెత్తి చూపిస్తూ "అక్కడ గోడమీద రెండు పొడి అక్షరాలు ఉన్నాయి గుర్తించావా, జాక్విస్!....ఎ. ఎమ్. అంటే ఏమిటో తెలుసా? అలెగ్జాండర్ మేనెట్ అనిదాని అర్థం! ఏదీ నీ చేతిలోవున్న ఇనుప రాడ్‌ను యిలా ఇవ్వు!" అన్నాడు.

దానితో అతడు పొగ వెళ్ళే చిమ్నీ వద్ద తవ్వడం ప్రారంభించాడు. కొంతసేపటికి గోడలోవున్న రాయి ఒకటి అటు యిటు కదిలింది. డిఫార్జ్ దానిని యివతలికి లాగి టార్చిలైటు సహాయంతో కంతలోనికి తొంగి చూసాడు. అతడికి లోపల ఏదో కాగితం కనిపించింది. డిఫార్జ్ దానికోసమే అక్కడికి వచ్చాడు. అతడికి కావలసింది కనిపించింది.

వెంటనే డిఫార్జ్ టార్చిని ఆర్పేసి జాక్విస్ మూడు చూడకుండా కాగితాన్ని తీసి బధంతో జేబులో దాచేసుకున్నాడు. తర్వాత నిరాశగా ముఖంపెట్టి వెనుదిరిగాడు.

"దేనికోసం వెదుకుతున్నారు? అక్కడ ఏమైనా కనిపించిందా?" జాక్విస్ మూడు ప్రశ్నించాడు.

"ఏమైనా వివరాలు దొరుకుతాయేమోనని వెదికాను. కానీ ఏమీ కనిపించ లేదు." అన్నాడు డిఫార్జ్.

తర్వాత 105 సెల్ నుండి యివతలికి వచ్చి బైటు ఆవరణలో వేచివున్న గుంపును చేరుకున్నారు. బయట వున్న ప్రజలు ప్రభుత్వ సైనికులను నేలమీద యీడ్చుకొంటూ వాళ్ళను కత్తులతో పొడుస్తూ తుపాకులతో కాలుస్తూ వాళ్ళ హాహా కారాలను చావులను కళ్ళారా చూస్తూ ఆనందించారు. కొంత మంది సైనికులను వీధులలోని స్తంభాలకు ఉరితీసారు. దాదాపు అన్ని వీధులూ రక్తంతో అరుణవర్ణం దాల్చాయి.

ఫ్రాన్స్‌లోని కోటలన్నీ కాలిబూడిద అయ్యాయి. బాస్టిల్లీ కోట జైలు విప్లవవీరులవశమైంది. గ్రామంలో వున్న మార్కిస్ కోట బూడిద కుప్పగా మారి పోయింది!....

## 9

ఆ విధంగా మూడు సంవత్సరాలు గతించిపోయాయి. విప్లవం మాత్రం పరిసమాప్తం కాలేదు. అలా ఎక్కడో ఒకచోట జరుగుతూనే వుంది.

లండన్‌లో వున్న టెల్‌సన్స్ బ్యాంక్ ఫ్రాన్స్‌నుండి పారిపోయి వచ్చిన కులీనులైన ధనవంతులకు రక్షణ స్థావరమైంది.

పారిస్‌లో వున్న టెల్‌సన్స్ బ్యాంక్ తాలూకు అతిముఖ్యమైన కాగితాలు రికార్డులను సంరక్షించేందుకు బాధ్యతగల వ్యక్తి కావాలని, పారిస్‌లోని బ్యాంక్ అధికారులు లండన్‌లోవున్న బ్యాంక్‌కు వర్తమానం పంపారు.

మిస్టర్‌లారీ పారిస్ వెళ్ళేందుకు ఉద్యుక్తుడయ్యాడు. అదే సమయంలో చార్లెస్ డార్నే మిస్టర్ లారీని చూసేందుకు బ్యాంక్‌కి వచ్చాడు.

"ఇది చాలా ప్రమాదంతో కూడుకున్న వ్యవహారం! ప్రస్తుత పరిస్థితుల్లో అంతదూరం ప్రయాణం చేయడం కష్టాలతో పోటీ పడటమే!.... మీకు అభ్యంతరం లేకపోతే మీ బదులు నేను పారిస్ వెళతాను. ఇప్పట్లో పారిస్ నగరం మీకు సురక్షిత స్థానం కాకపోవచ్చును." అన్నాడు చార్లెస్ డార్నే మిస్టర్ లారీతో.

మిస్టర్‌లారీ మందహాసం చేస్తూ "మైడియర్ చార్లెస్! ప్రస్తుత పరిస్థితుల్లో నాకే గాదు, నీకు గూడ పారిస్ నగరం సురక్షిత స్థానంకాదు. ఎందుకంటే నువ్వు ఫ్రాన్సుకు చెందిన కులీన ధనవంతుడివి కనుక!.... నువ్వు ఫ్రాన్సు ఎందుకు వెళ్ళాలనుకుంటున్నావో, నీ మనసులోని ఆలోచనలు ఏమిటో నాకు బాగా తెలుసు. నీ ఆలోచనలు ఏమిటో లూసీకి తెలిస్తే ఎంత బాధపడుతుందో ఆ తర్వాత ఆమె పరిస్థితి ఏమిటో కొంచెమైనా ఆలోచించావా?" అన్నాడు.

"మిస్టర్ లారీ! నేను ఫ్రెంచి జాతీయుడిని కనుక నా జాతి ప్రజలతో కలిసి ఉండాలని, నేను కోరుకోవడంలో తప్పులేదనుకుంటాను." అన్నాడు చార్లెస్ డార్నే.

"పారిస్‌లో వున్న మా బ్యాంక్ తాలూకు డాక్యుమెంట్లు ఏ క్షణంలోనైనా నాశనం కావచ్చును. కనుక ఈ రాత్రికే ప్రయాణమై పారిస్ వెళ్ళాలనుకుంటున్నాను." అన్నాడు మిస్టర్ లారీ.

"అయితే మీరొక్కరే వెళ్దామనుకుంటున్నారా?"

"లేదు! జెర్రీక్రంచర్ నాతోబాటే వస్తున్నాడు!"

అంతలో బ్యాంక్ గుమస్తా ఒకడు అతికించబడిన కవరు ఒకటి తెచ్చి

మిస్టర్ లారీ ముందు ఉంచాడు. ప్రక్కనే కూర్చున్న చార్లెస్ ఆ కవరు వంక చూసాడు. ఆ కవరు మీద అతడి పేరు స్పష్టంగా రాసి ఉంది.

కవరు మీద 'అర్జంట్.... దీనిని ఫ్రాన్సులో ఘనత వహించిన మార్క్విస్ ఎవర్‌మాండే ప్రభువుకు లండన్‌లో అందజేయాలి- అని బిగ్గరగానే చదివాడు



మిస్టర్ లారీ, ఛార్లెస్ డార్నే ఫ్రాన్సులోని విప్లవం గురించీ అక్కడకు వెళ్ళే విషయమై సంభాషించుట!

చార్లెస్ డార్నే.

చార్లెస్ డార్నే అసలు పేరు ఏమిటో లండన్‌లో ఉన్నవారెవరికీ తెలియదు. ఒక్క డాక్టర్ అలెగ్జాండర్ మేనెట్‌కి తప్ప!-

చార్లెస్, లూసీల వివాహం రోజున చార్లెస్ తన ఫ్రెంచి నామధేయమేమిటో డాక్టర్‌తో రహస్యంగా చెప్పాడు.

"నేను బ్యాంక్‌లో ఉన్న ఉద్యోగులనందర్నీ ఫ్రాన్సు నుండి పారిపోయి వచ్చిన వారినందర్నీ యీ వ్యక్తి విషయమై వాకబు చేసాను. కానీ యీ వ్యక్తి ఎవరో ఎవరికీ తెలియదని చెప్పారు." అన్నాడు మిస్టర్ లారీ.

చార్లెస్ డార్నే నవ్వి "ఈ వ్యక్తి నాకు బాగా తెలుసు. కవరు యిలా ఇవ్వండి. దీనిని నేను అతడికి అందజేస్తాను." అన్నాడు.

ఛార్లెస్ తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసాడు. తర్వాత కవరు విప్పి చూసాడు.

మార్క్విస్ ఎవర్‌మాండే ప్రభువులకు చెందిన ఒక గ్రామానికి అధికారి. పన్నులు వసూలు చేసే అధికారి అయిన 'గాబెల్' రాసిన ఉత్తరమది:

చార్లెస్ ఆ లేఖను బిగ్గరగా యిలా చదివాడు:

"ఆర్యా! నేను మీ ప్రభువులకు చెందిన ఒక గ్రామంలో పన్నులు వసూలు చేసే అధికారిని నా పేరు గాబెల్! విప్లవం ప్రారంభం కాగానే గ్రామస్థులు నన్ను చుట్టుముట్టి బంధించారు. నన్ను పారిస్ తీసుకొచ్చి విప్లవనాయకులకు అందజేసారు. వారు నన్ను జైలులో పెట్టారు. ఇప్పుడు నా జీవితానికి ముప్పు ఏర్పడింది. నామీద మోపబడిన నేరం ఏమిటంటే ప్రభువులైన మీ కుటుంబానికి నేను సేవ చేయడమే! పేద ప్రజల వద్దనుండి పన్నులు వసూలు చేయవద్దని మీరు నాకు ఆజ్ఞలు జారీ చేసారనీ, అందువలన నేను పన్నులు వసూలు చేయడంలేదని చెప్పినా విప్లవ నాయకులు నమ్మడంలేదు. అంతేకాదు తన తండ్రి, చిన్నాన్నలు వసూలుచేసిన పన్ను సొమ్ము యావత్తూ తిరిగి ఎవరి సొమ్ము వారికి యిచ్చివేయమని మీరు నాకు ఆర్డరు పంపారని చెప్పినా వారు నమ్మడంలేరు. దేశ ప్రజలకు ద్రోహం చేయడమే నేను చేసిన నేరమట. కనుక నేను దేశద్రోహినట. స్వదేశంనుండి ఇతర దేశానికి పారిపోయి స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్న మీకు సేవలు చేయడం నేరమట. మీరు పేద ప్రజల మనుషులనీ, వాళ్ళకోసం అహర్నిశలూ ఆలోచిస్తూ మంచి చేయాలని కలలుకనే ఉత్తమ వ్యక్తి అనీ ఎంత చెప్పినా వారు నమ్మడంలేదు.

త్వరలోనే నామీద ప్రజల ముందు ప్రజల కోర్టులో విచారణ జరుగుతుంది. తప్పకుండా నేను ఉరితీయబడతాను.

నేను కోరేది ఒక్కటే! తక్షణం ఫ్రాన్స్ బయలుదేరి రండి! నన్ను యీ

ఆపదనుండి కాపాడండి!....నేను మీకు విశ్వాసపాత్రుడ్ని! నిజమైన సేవకుడ్ని! నన్ను మీరొక్కరే రక్షించగలరు."

ఇట్లు
మీ విశ్వాస పాత్రుడైన సేవకుడు
గాబెల్.



ఫ్రాన్స్ వచ్చిన ఛార్లెస్‌ను సిటీగేటువద్ద విప్లవ సంఘం అధికారి ఒకడు ఆపుజేసి కాగితాలు తనిఖీ చేయుట !

తక్షణం ప్రయాణమై ఫ్రాన్స్ వెళ్ళడమే మంచిదని చార్లెస్ నిశ్చయించుకున్నాడు. తను లండన్ విడిచి అవతలికి వెళ్ళేవరకు యీ విషయం గురించి ఎవరికీ

తెలియదు అనుకున్నాడు చార్లెస్.

ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకు తనగదిలో కూర్చుని డాక్టర్ మేనెట్‌కి ఒక ఉత్తరం, తన భార్య లూసీకి ఒక ఉత్తరం రాసాడు. ఆ ఉత్తరాలలో తాను ఫ్రాన్స్ ఎందుకు వెళ్ళవలసి వస్తున్నదో కారణాలను ఉదహరిస్తూ విపులంగా రాసాడు. తన సేవకుడ్ని రక్షించడానికేకాదు; తమ వంశ గౌరవాన్ని నిలబెట్టడం కోసం కూడా తాను ఫ్రాన్స్ వెళుతున్నానని చార్లెస్ ఆ ఉత్తరాంలో రాసాడు.

ఆ ఉత్తరాలు ఉదయం డాక్టర్ మేనెట్‌కి, మిసెస్ లూసీకి అందే సమయానికి చార్లెస్ డార్నే ఇంగ్లండ్‌ను విడిచిపెట్టి ఫ్రాన్స్ భూభాగంగుండా ప్రయాణం చేస్తున్నాడు—

## 10

ప్రతి నగరం తాలూకు సింహద్వారాలవద్దా, గ్రామాలలో పన్నులు చెల్లించే ఆఫీసులవద్దా దేశభక్తులు తుపాకులు పుచ్చుకుని వచ్చేపోయే ప్రయాణీకుల బళ్ళను ఆపు చేస్తున్నారు. వారివద్దవున్న గుర్తింపు కాగితాలను తనిఖీ చేస్తున్నారు. వాళ్ళ పేర్లు తమవద్దవున్న దేశద్రోహుల జాబితాలో ఉన్నవో లేదో పరీక్షిస్తున్నారు. అన్నీ సవ్యంగావుంటే నగరంలోకి వెళ్ళనిస్తున్నారు. లేకపోతే వెనక్కి తిరిగి పంపిస్తున్నారు. అదీ ఇదీ కాకపోతే జైలుకు పంపిస్తున్నారు.

చార్లెస్ డార్నే ఎక్కినబండి సిటీగేటు దగ్గరకు వచ్చింది. ఒక గార్డు బండిని తీసుకుని పారిస్ వీధులలోని విప్లవకారుల మధ్యగా పోనిచ్చి ఓ కార్యాలయం వద్దకు తీసుకొచ్చాడు.

ఆ కార్యాలయంలో అధికారి ఒకడు కూర్చుని ఉన్నాడు.

అతడు గార్డు వంక చూస్తూ "ఈ ఖైదీ తాలూకు కాగితాలు ఎక్కడ ఉన్నాయి?" అని ప్రశ్నించాడు.

'ఖైదీ' అన్న వాక్యం ఛార్లెస్‌కు కొరడా దెబ్బవలె తగిలింది. తాను ఖైదీని కాననీ, తన ఇష్టప్రకారమే లండన్ నుంచి పారిస్ వచ్చాననీ, తన సేవకుడు తనకు లేఖ రాయడంవల్ల రావలసి వచ్చిందనీ చెబుతూ అతడా లేఖను అధికారికి చూపించాడు.

అంతలో అటుగా వెళ్తున్న ఓ మొరటు మనిషిని "చూడండి డిఫార్జ్! ఇతడు దేశద్రోహి అయిన ఎవర్‌మాండే కదూ!" అని ఆఫీసర్ అడిగాడు.

"అవును!" అని జవాబు చెప్పాడు డిఫార్జ్.

"ఓహో! ఎవర్‌మాండే!... చూడు! నిన్ను 'లాఫోర్సు' జైలుకు పంపిస్తున్నాము" అన్నాడు అధికారి.

"ఇది చాలా అన్యాయం! ఏమిటి నేను చేసిన నేరం?" అని ప్రశ్నించాడు ఛార్లెస్ ఉద్వేగంగా.



తన గదిలో అడుగుపెట్టిన డాక్టర్ మేనెట్ అతడి కూతురు లూసీ ఫ్రాన్స్ ఎప్పుడు వచ్చారా? అని మిస్టర్ లారీ ఆశ్చర్యంగా చూచుట!

"నువ్వు ఫ్రాన్స్ నుండి వెళ్ళిపోయిన తర్వాత, మేము కొత్త కార్యాలయాలను ఏర్పాటు చేసాము. కొత్త చట్టాలను తయారు చేసుకున్నాము. తెలిసిందా ఎవర్‌మాండే!" అన్నాడు అధికారి నవ్వుతూ.

"నేను పారిస్ వచ్చింది, నా సేవకుడైన సాటి ఫ్రెంచిదేశపు వ్యక్తిని రక్షించడానికి! అది మీ దృష్టిలో నేరమా? అతడ్ని రక్షించే హక్కు నాకు లేదా?" అడిగాడు ఛార్లెస్.

"దేశద్రోహులకు హక్కులుండవు" అంటూ అధికారి డిఫార్గును పిలిచి "ఇతడ్ని తీసుకువెళ్ళు!" అని చెప్పాడు.

డిఫార్గు ఛార్లెస్‌ను, పారిస్‌లోని 'లాఫోర్స్' జైలుకు తీసుకువెళుతూ "డాక్టర్ మేనెట్ కుమార్తె అయిన లూసీని వివాహం చేసుకున్నది నువ్వే కదూ?" అని అడిగాడు.

ఛార్లెస్ డార్నే ఆశ్చర్యపోతూ "అవును!" అన్నాడు.

"నా పేరు ఎర్నెస్ట్ డిఫార్గు! సెయింట్ ఆంథోనీ ప్రాంతంలో వున్న బ్రాందీ షాపు యజమానిని! బహుశా నువ్వు నా గురించి వినే వుంటావు" అన్నాడు డిఫార్గు.

"ఎందుకలా అడుగుతున్నారు? ఒకసారి ఎప్పుడో నా భార్య తన తండ్రి విషయమై మీతో మాట్లాడటానికి వచ్చిందట" అన్నాడు ఛార్లెస్.

"ఉన్నవాడివి లండన్‌లోనే ఉండక, తిరిగి ఫ్రాన్స్ దేనికి వచ్చావు?" అన్నాడు డిఫార్గు బాధగా.

"నేను దేనికి వచ్చానో ఇందాక అక్కడున్న అధికారితో చెప్పగా మీరూ విన్నారు కదా!....అంతే నేను చెప్పిన విషయాన్ని మీరు కూడా నమ్మతంలేదా?" అడిగాడు ఛార్లెస్.

"నేను నమ్మడం, నమ్మకపోవడం అనేది ఎవరూ పట్టించుకోని విషయం."

"ఒక్క విషయం చెప్పండి! నేను జైలులో ఉన్నప్పుడు బయటి ప్రపంచంతో సంబంధాలు పెట్టుకోవచ్చునా?"

"అది నీకు తర్వాత తెలుస్తుంది."

"టెల్‌సన్స్ బ్యాంక్ తాలూకు మిస్టర్ లారీకి నేనీ జైలులో ఉన్నట్లు తెలియడం అత్యవసరం. అతడు ప్రస్తుతం పారిస్‌లోనే ఉన్నాడు. ఆ సహాయం చేయగలరా?" అన్నాడు చార్లెస్.

"నీ విషయంలో నేను ఎటువంటి సహాయమూ చేయలేను" అన్నాడు డిఫార్గు.

## 11

మిస్టర్ లారీ పారిస్‌లోని టెల్‌సన్స్ బ్యాంక్ ఆఫీసులో కూర్చుని ముఖ్యమైన కాగితాలను చూస్తున్నాడు.

అదే సమయంలో డాక్టర్ మేనెట్, మిసెస్ లూసీ అతడి గదిలోకి అడుగు పెట్టారు.

వాళ్ళను చూస్తూనే మిస్టర్ లారీ నివ్వెరపోతూ "ఏమిటిది? మీరు పారిస్ దేనికొచ్చారు?" అన్నాడు.

"చార్లెస్ ఇక్కడే ఉన్నాడు. అతడి సేవకుడ్ని రక్షించడానికి వస్తే ప్రజానాయకులు అతడి మీద దేశద్రోహ నేరం మోపి జైలులో బంధించారు." అన్నాడు డాక్టర్ మేనెటు.

"అది నిజంకాదు." అన్నాడు మిస్టర్ లారీ ఉద్వేగంగా.

అదే సమయంలో బ్యాంక్ వెలుపల ఉన్న ఆవరణలోకి పెద్దగా కేకలు పెడుతున్న గుంపు ఒకటి చేరుకుంది.

"ఏం జరుగుతున్నదిక్కడ?" అన్నాడు డాక్టర్ మేనెటు ఆశ్చర్యపోతూ.

"మీరు ప్రమాదంలో చిక్కుకున్నట్టే డాక్టర్ మేనెటు!" అన్నాడు మిస్టర్ లారీ.

డాక్టర్ మేనెటు నవ్వి "నేను సంవత్సరాల తరబడి బాస్టిల్లీ జైలులో ఖైదీగా జీవితం గడిపాను. ఆ ఒక్క సంఘటన యిక్కడి ప్రమాదాల నుండి నన్ను నేను రక్షించుకునే శక్తిని ఇస్తుంది. ఆ శక్తి ఆధారంగానే మేము ఇక్కడికి క్షేమంగా చేరుకోగలిగాము. చార్లెస్‌ను ప్రమాదాల నుండి తప్పించడానికి ఆ శక్తి సరిపోతుంది మిస్టర్ లారీ!" అన్నాడు.

"సరే! మీరు బయటికి వెళ్ళి, రక్త పిపాసువైన ఆ దెయ్యాలతో మీరెవరో చెప్పండి. మీరు ఎందుకు వచ్చిందీ వివరించండి. అది చార్లెస్‌ను రక్షింపవచ్చును. ఇంకా మించిపోయింది లేదు. వెళ్ళండి!" అన్నాడు మిస్టర్ లారీ.

డాక్టర్ మేనెటు విసురుగా బయటికి వెళ్ళాడు. బయట కత్తులు, బాకులు, పిస్టల్స్ పట్టుకుని వున్న జనం డాక్టర్ చుట్టూ మూగారు.

మిస్టర్ లారీ గదిలో కూర్చుని అద్దాల గోడలో నుంచి బయట ఏం జరుగుతున్నదీ గమనిస్తున్నాడు. డాక్టర్ మేనెటు ఆవేశంగా ఏదో ఉపన్యసిస్తున్నాడు. అక్కడ మూగిన ప్రజలు డాక్టర్ చెప్పే మాటలు శ్రద్ధగా ఆలకించారు.

ఆ తర్వాత పెద్దగా కేకలు పెడుతూ "బాస్టిల్లీ ఖైదీ చిరకాలం వర్ధిల్లాలి! 'లా ఫోర్స్' జైలులో బంధింపబడిన ఖైదీకి సహాయం చేయాలి. ఖైదీ ఎవర్మాండేని విడుదల చేయాలి." అంటూ వాళ్ళు నినాదాలు చేసారు.

అక్కడ నుంచి గుంపు బయలుదేరింది. డాక్టర్ మేనెటుని కూడా తమ వెంట తీసుకువెళ్ళారు.

మిస్టర్ లారీ, మిసెస్ లూసీ రాత్రంతా డాక్టర్ రాకకోసం ఎదురు తెన్నులు చూసారు. అయినా డాక్టర్ తిరిగిరాలేదు. తెల్లవారిన తర్వాత కూడా డాక్టర్ మేనెటు రాకపోయేసరికి మిస్టర్ లారీ బ్యాంక్ సమీపంగా ఉన్న ఒక ఇంటిని, మిసెస్ లూసీ, ఆమె కూతురు మిస్ ప్రాస్ కోసం అద్దెకు తీసుకున్నాడు. ఆ ముగ్గురు అక్కడ ఉండసాగారు. ఆ ఆడవాళ్ళ రక్షణ కోసం జెర్రీక్రంచర్‌ను ఆ ఇంటివద్ద కాపలాగా ఉంచాడు.

ఆ రోజు కూడా గడిచింది. అయినా డాక్టర్ జాడలేదు. మిస్టర్ లారీ తన ఆఫీసు గదిలో కూర్చుని అతి ముఖ్యమైన డాక్యుమెంట్లు చూసుకుంటున్నాడు.

అంతలో ఓ కొత్త వ్యక్తి గదిలో అడుగుపెట్టాడు.

"నన్ను గుర్తు పట్టారా మిస్టర్ లారీ!" అని అడిగాడు.

"మిమ్మల్ని ఎక్కడో చూసిన జ్ఞాపకం వస్తున్నది." అన్నాడు మిస్టర్ లారీ.

"నన్ను సెయింట్ ఆంథోనీలో వున్న మా బ్రాందీషాపులో చూసి ఉంటారు" అన్నాడు డిఫార్జ్.

మిస్టర్‌లారీనవ్వి "అవునవును! జ్ఞాపకం వచ్చింది! అదిసరే ఏమిటి విషయం? బహుశా మీరు డాక్టర్ మేనెట్ వద్ద నుండి వచ్చారని భావిస్తున్నాను." అన్నాడు.

డిఫార్జ్ చేతిలోవున్న కాగితాన్ని మిస్టర్‌లారీ ముందు ఉంచాడు.

ఆ కాగితంలో యిలా వుంది. "చార్లెస్ క్షేమంగానే ఉన్నాడు. అతడ్ని ఇక్కడ ఒంటరిగా వదిలి రావడం నా కిష్టంలేదు. లూసీకి చార్లెస్ రాసిన ఉత్తరం కూడా ఇతను తెచ్చాడు. ఇతడికి లూసీని చూపించు."

మిస్టర్‌లారీ పైకిలేచి "నా వెంట రండి. లూసీని చూపిస్తాను" అంటూ బ్యాంక్ వెలుపలికి వచ్చాడు.

అక్కడ బైటనిలబడి లేసు అల్లుతున్న మేడమ్ డిఫార్జను మిస్టర్‌లారీ చూసాడు. కొన్ని సంవత్సరాల క్రితం చూసినప్పుడు ఎలా వుందో ఇప్పుడూ

అలాగే ఉండటం చూసిన మిస్టర్ లారీ ఎంతో ఆశ్చర్యపోయాడు.

అది చూసిన డిఫార్జ్ "మేడమ్ డిఫార్జ్ కూడా మనతో బాటే అక్కడకు వస్తుంది. ఈమె వాళ్ళను చూస్తుందట! .... దానివల్ల వారికి ఒక విధంగా రక్షణ ఏర్పడుతుంది." అన్నాడు.



జైలులోవున్న చార్లెస్‌వద్ద నుండి తెచ్చిన ఉత్తరం చదువుతున్న లూసీవేపు మేడమ్ డిఫార్జ్ తీక్షణంగా కోపంతో చూచుట!

అతడు చెప్పిన కారణం నమ్మబుద్ధి కాలేదు మిస్టర్ లారీకి. 'మేడమ్ డిఫార్జ్ మనసులో ఏదో దురాలోచన ఉండి ఉంటుంది' అనుకున్నాడు.

అయినా వాళ్ళను తీసుకుని లూసీ ఉంటున్న ఇంటికి చేరుకున్నాడు.

డిఫార్జ్ తాను తెచ్చిన ఉత్తరాన్ని లూసీకియిచ్చాడు.

ఆమె దుఃఖిస్తూ దానిని యిలా చదివింది! "నా ప్రియమైన లూసీ! ధైర్యంగా ఉండు! నేను క్షేమంగానే ఉన్నాను. మీ నాన్న నన్ను కంటికి రెప్పలాకాపాడు తున్నాడు. మన పాపకు నా ముద్దులు అందజెయ్!"

లూసీ తలెత్తి మేడమ్ డిఫార్జ్ వంక చూసింది. అప్పటికే మేడమ్ డిఫార్జ్ క్రూరమైన చూపులు, లూసీ మీద ఉన్నాయి. ఆ చూపుల తీవ్రతకు లూసీ భయపడి పోయింది. తర్వాత మేడమ్ డిఫార్జ్ చూపులు లూసీ కుమార్తె మీదికి, ఆ తర్వాత మిస్ ప్రాస్ మీదికి మళ్ళాయి.

"ఇకచాలు! వీళ్ళను చూడటం అయిపోయింది. పద వెళదాం!" అంది మేడమ్ డిఫార్జు కర్కశంగా.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత "మిస్టర్ లారీ! ఈ యువతి చూపులకు భయ పడినంతగా యీ ప్రపంచంలోని ఏ విషయానికీ యింతవరకు నేను భయపడలేదు. ఎంత క్రూరత్వముంది ఆ చూపులో" అంది భయపడుతూ.

## 12

నాలుగు రోజులు యిట్టే గడిచిపోయాయి. డాక్టర్ మాత్రం ఇంటికిరాలేదు. అయితే అతడు జైలులోని విషయాలు ఎప్పటికప్పుడు మిస్టర్ లారీకి తెలియజేస్తూనే ఉన్నాడు.

ఆ నాలుగు రోజులలో నిరపరాధులైన పదకొండు వందల మంది ఖైదీలను స్త్రీ, పురుష భేదం లేకుండా పిచ్చెక్కిన ప్రజలు నిర్దాక్షిణ్యంగా చంపేసారని డాక్టర్ తెలియజేసాడు.

"జైలులోనే న్యాయస్థానం ఏర్పాటు చేయబడింది. దానికి 'ప్రజల కోర్టు' అని పేరు పెట్టారు. ఒక్కొక్క ఖైదీని అక్కడకు రప్పించి, విచారణ అనేది లేకుండా 'వీడు నేరస్థుడు. చంపేయండి' అని తీర్పు చెబుతున్నారు. అలా తీర్పు చెప్పిన తర్వాత ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ ఖైదీ జీవించి ఉండటం అసంభవం!.... ఇదీ యిక్కడి పరిస్థితి" అని మిస్టర్ లారీకి తెలియజేశాడు డాక్టర్ మేనెటు.

ఒకసారి డాక్టర్ మేనెటు ప్రజల కోర్టులో నిలబడి తన గురించి చెప్పు కున్నాడు. కోర్టులో విచారణ అనేది లేకుండా బాస్టిల్లీ జైలులో పద్దెనిమిది సంవ త్సరాలు శిక్ష అనుభవించానని డాక్టర్ చెప్పాడు. న్యాయస్థానంలో ఉన్న డిఫార్జు దానికి సాక్షిగా నిలబడ్డాడు.

ఛార్లెస్ ప్రాణాలను రక్షించమనీ అతడికి స్వేచ్ఛను ప్రసాదించమనీ డాక్టర్ మేనెటు వాదించాడు.

ట్రిబ్యునల్ సభ్యులు రహస్య సమావేశం జరిపి ఒక నిర్ణయానికి వచ్చారు. "ఛార్లెస్ డార్నేను చంపకూడదని మేము నిర్ణయించుకున్నాము. అయితే



కోర్టులో డాక్టర్ మేనెటు, ఛార్లెస్ గుణగణాల గురించి వివరించి చెప్పుట.

అతడికి ఉద్రేక పూరితులైన ప్రజల వలన ప్రాణ హాని కలుగవచ్చును కనుక, ప్రస్తుతం అతడు జైలులోనే ఉండాలని తీర్పు చెబుతున్నాము" అని!

జైలులో ఉన్నా ప్రజలు ఆవేశంతో అతడ్ని చంపే అవకాశం ఉంది

కాబట్టి ఛార్లెస్‌కు తోడుగా తనను కూడా జైలులో ఉండేందుకు అనుమతించవల సిందిగా న్యాయ స్థానాన్ని కోరాడు డాక్టర్ మేనెటు. అందుకు వారు అనుమ తించారు.

డాక్టర్ మేనెటు జైలులో స్వేచ్ఛగా తిరుగుతూ, రోగిష్టులైన ఖైదీలను చూడడం, వారికి సేవలు చేయడం మొదలు పెట్టాడు. అతడు అప్పుడప్పుడు లూసీ వద్దకు వచ్చి ఛార్లెస్ క్షేమంగా ఉన్నట్టు చెబుతుండేవాడు.

అతని మంచితనం, సత్ప్రవర్తన, ఇతరులకు సహాయం చేయాలనే గుణం, యివన్నీ డాక్టర్ మేనెటుకి జైలులో మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టాయి.

ఎలాగైనా ఛార్లెస్‌ను జైలు నుండి ఇంటికి తీసుకు వెళ్ళాలనీ లేదా కనీసం అతడి మీద, న్యాయస్థానంలో విచారణ అయినా జరిపించాలనీ, ప్రజల అభి ప్రాయాలు న్యాయస్థానం తప్పక అంగీకరించాలి కాబట్టి, ప్రజాభిప్రాయం తనకు అనుకూలంగా ఉంటుంది కనుక, ఛార్లెస్ విడుదల కావడం ఏమంత కష్టం కాదని డాక్టర్ మెనేట్ భావించాడు.

ఫ్రాన్స్ రాజు, రాణి మృత్యు యంత్రంనుండి తప్పించుకోవాలని విశ్వ ప్రయత్నం చేసారు. కాని ప్రయోజనం లేకపోయింది. వాళ్ళు మృత్యు యంత్రంలో చిక్కుకొని ప్రాణాలు పోగొట్టుకున్నారు.

రెండు పొడవాటి స్తంభాలకు పైభాగాన వెడల్పాటి, బరువైన రేకు ఉంటుంది. దాని క్రింది భాగం కత్తివలె పదునుగా ఉంటుంది. క్రింద నేల భాగంలో, మృత్యు దండన విధించిన వారిని మోకాళ్ళ మీద కూర్చుండబెడతారు. ఆ ఖైదీ తల క్రింద వున్న చెక్క మీద ఆనించబడుతుంది. పైన ఉన్న కత్తికి తాడు కట్టబడి ఉంటుంది. ఒక వ్యక్తి అక్కడ నిలబడి తాడును విడిచిపెడతాడు. వెంటనే పైన ఉన్న కత్తి విసురుగా వచ్చి క్రింద వున్న ఖైదీ మెడ మీద బలంగా పడుతుంది. అంతే!—ఖైదీ తల తెగి నేల మీద పడుతుంది!

ఫ్రాన్స్ దేశంలో ఆనాటి మృత్యుదండన ఆ విధంగా ఉండేది. ఎంతో మంది ఖైదీలు ఆ మృత్యు యంత్రానికి బలైపోతూనే ఉన్నారు.

## 13

ఒక సంవత్సరం మూడు మాసాలు ఆ విధంగా గడిచిపోయాయి. తన భర్త శిరస్సు మృత్యుయంత్రం పాతబడకుండా సురక్షితంగా ఉంటుందో లేదోనని లూసీ భయపడసాగింది.

ఒకనాడు ఛార్లెస్ డార్నే ప్రజా కోర్టుకు తీసుకురాబడ్డాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ అతణ్ని దేశద్రోహిగా నిర్ధారించాడు. ఫ్రాన్సు దేశం 'రిపబ్లిక్'గా మారినందువల్ల పాత చట్టాలు పోయి కొత్త చట్టాలు వచ్చాయనీ, కొత్త చట్టాల ప్రకారం దేశద్రోహులకు మరణశిక్ష తప్పదనీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదించాడు.



ఛార్లెస్‌ని తిరిగి అరెస్టు చేయడానికి నలుగురు గార్డులు పిస్టల్స్ పుచ్చుకుని వాళ్ళ గదిలో అడుగుపెట్టుట!

ఛార్లెస్ తన వాదన వినిపిస్తూ యిలా అన్నాడు :

"నేను దేశద్రోహిని కాదు. ఆ నీచమైన బిరుదును నాకు బలవంతంగా అంటగట్టారు. నేను ఫ్రాన్సును విడిచిపెట్టి లండన్ వెళ్ళింది భయపడి కాదు.

అక్కడ పని చేసుకుంటూ నా బ్రతుకు నేను బ్రతకాలని వెళ్ళాను. నేను కులీన వంశానికి చెందిన వాడిని. నిజమే!.... నేను ధనవంతుడనే!.... అయినా సరే, ఆ ధనాన్ని హాయిగా అనుభవించకుండా, అన్ని సుఖభోగాలనూ త్యజించి సామాన్య వ్యక్తిలా లండన్ దేనికి వెళ్ళాను. కులీనులు, ప్రభువులు పేదవారిమీద చేస్తున్న అరాచకాలనూ, అణచివేత ధోరణులనూ సహించలేకనే! ఫ్రాన్సులో ఉన్న నా సోదర పేద ప్రజలకు సహాయం చేయాలన్నదే నా లక్ష్యం. అటువంటి నేను దేశ ద్రోహినెలా అవుతాను?"

"నువ్వు చెబుతున్న వాటికి సాక్ష్యాధారాలు చూపించగలవా?" అని అధ్యక్షుడు అడిగాడు.

"నేను చెబుతున్నదానికి సాక్ష్యాధారాలుగా ఇద్దరు సాక్షులున్నారు. ఒకరు విశ్వాసపాత్రుడైన నా సేవకుడు గాబెల్. రెండవవారు డాక్టర్ మేనెట్!" అన్నాడు ఛార్లెస్.

డాక్టర్ మేనెటు సాక్ష్యం చెబుతూ "ప్రభువులమీద తిరుగుబాటు ప్రారంభమైందని తెలిసికూడా తోటి ఫ్రెంచి జాతీయుడిని కాపాడటంకోసం చార్లెస్ అన్నిటికీ తెగించి ఫ్రాన్సు వచ్చాడు. అతడు తన ధన సంపదలు కాపాడుకోవడం కోసం రాలేదు కదా!....అతడు లండన్‌లో హాయిగా జీవిస్తున్నాడు. అతడికి ఫ్రాన్స్ రావలసిన అవసరం ఏముంది చెప్పండి? ఒక సత్కార్యంకోసం పాటుపడే మనిషికి యీ రిపబ్లిక్ నేరస్థుడని ముద్ర వేస్తుందా? న్యాయస్థానం దృష్టిలో చార్లెస్ దేశ ద్రోహి అవుతాడా? దీనిని ప్రజలే నిర్ణయించాలి" అన్నాడు.

న్యాయస్థానంలో ఉన్న ప్రజలు పెద్దగా "కాదు! చార్లెస్ దేశద్రోహి కాదు" అంటూ కేకలు వేసారు.

న్యాయస్థానం కూడా చార్లెస్ నేరస్తుడు కాదు అని నిర్ణయించి అతడ్ని విడుదల చేసింది.

చార్లెస్ ఇంటికి వచ్చాడు. అందరూ ఆనంద సాగరంలో మునిగిపోయారు.

రోజు మాదిరిగానే మిస్ ప్రాస్, జెర్రీ క్రంచర్ సరుకులు కొని తీసుకు రావడానికి మార్కెట్టుకు వెళ్ళారు.

ఆ సమయంలో చార్లెస్ వాళ్ళు ఉంటున్న ఇంటి తలుపులను ఎవరో తట్టి పిలిచారు. డాక్టర్ మేనెటు వెళ్ళి తలుపులు తీశాడు. మొరటుగావున్న నలుగురు వ్యక్తులు విసురుగా లోనికి వచ్చారు. వాళ్ళు ఎర్ర టోపీలు ధరించి వున్నారు. ఆ

నలుగురి చేతుల్లోనూ పిస్టల్స్ వున్నాయి.

"మేము ఎవర్‌మాండే కోసం వచ్చాము" అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

"అతడు నేరస్థుడిగా తిరిగి రిపబ్లిక్ చేత నిర్ణయింపబడ్డాడు-" అన్నాడు మరొకడు.

"అతడు చేసిన నేరం ఏమిటి? ఏ విషయంమీద అతడు నేరస్థుడిగా నిర్ణయించబడ్డాడు" డాక్టర్ మేనెట్ ప్రశ్నించాడు.

"సెయింటు ఆంథోనీలో వున్న ముగ్గురు సాక్షులు ఎవర్‌మాండేకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారు. మేము ఇంతకంటే ఎక్కువ చెప్పలేము. మీరు రేపు ఉదయాన్నే వచ్చి వివరాలు తెలుసుకోవచ్చును" అన్నారు వాళ్ళు.

ఆ తర్వాత నలుగురు వ్యక్తులు చార్లెస్‌ను వెంట బెట్టుకుని వెళ్ళిపోయారు.

మిస్ ప్రాస్, జెర్రీ క్రంచర్ మార్కెట్టుకి వెళ్ళి తిరిగి వస్తూ బ్రాందీ సేవించాలని బ్రాందీషాపు వద్దకు వచ్చారు.

మిస్ ప్రాస్ బ్రాందీషాపులో అడుగుపెడుతూనే సన్నగా నాజూకుగా వున్న ఒక వ్యక్తిని చూసింది. చూస్తూనే సంతోషంతో ఉప్పొంగిపోతూ పరిగెత్తుకుంటూ వెళ్ళి ఆ వ్యక్తిని కౌగలించుకుంది.

అది చూసిన జెర్రీ క్రంచర్ విషయమేమిటో అర్థంగాక ఎంతో ఆశ్చర్యంతో నిలబడిపోయాడు.

"ఒరే! సాలమన్! నా ప్రియమైన తమ్ముడా! ఎన్నో సంవత్సరాల తర్వాత నిన్ను యిక్కడ చూడగలిగానురా! నాకెంత సంతోషంగా ఉందో తెలుసా?" అంది మిస్ ప్రాస్ బిగ్గరగా.

ఆ వ్యక్తి అటు యిటు బెదురుచూపులు చూస్తూ "హుష్! గట్టిగా అరవకు! ఇక్కడ నాపేరు సాలమన్‌కాదు!.... నేను ప్రాణాలతో బ్రతికి ఉండటం నీకు యిష్టం లేదా?" అన్నాడు నెమ్మదిగా.

"ఇన్ని సంవత్సరాల తర్వాత కనిపించిన అక్కతో యిలాగేనట్రా మాట్లాడేది" అంటూ మిస్ ప్రాస్ బాధపడింది.

ఆ వ్యక్తి మిస్ ప్రాస్‌నూ, జెర్రీ క్రంచర్‌నూ బ్రాందీషాపు యివతలికి తీసుకొచ్చాడు.

అక్క బుగ్గను ప్రేమతో ముద్దుపెట్టుకుంటూ "మీరు పారిస్‌లో వున్న విషయం నాకు తెలిసింది. ఇక్కడ ఎవరెవరు ఉన్నదీ నాకు తెలుసు. నేనిక్కడ

జైలు అధికారులలో ఒకడిగా పనిచేస్తున్నాను. నేను క్షేమంగా ఉండాలని నువ్వు నిజంగా కోరుకునేదానివే అయితే ఇంకెప్పుడూ నన్ను కలుసుకోవడానికి ప్రయత్నించకు" అన్నాడు.

"ఈ విధంగా విదేశీయుల వద్ద పనిచేస్తూ అక్కడే కలుసుకోవద్దని చెప్పేటంత గొప్పవాడివయ్యావా?" అంది మిస్ ప్రాస్ బాధపడుతూ.

అంతవరకు మౌనంగా నిలబడి వాళ్ళ సంభాషణ వింటున్న జెర్రీక్రంచర్ అతడి భుజం పుచ్చుకుని "నువ్వు ఇంగ్లండ్‌లో సొలమన్ అనే పేరును ఉపయోగించలేదే!.... ఛార్లెస్ డార్నే మీద లండన్‌లో జరిగిన కేసులో నువ్వొక సాక్షివి కదూ!.... అక్కడ నీ పేరు......."

"జాన్‌బర్సడ్! అవునా?" అన్నారెవరో.

అలా చెప్పింది ఎవరా? అని జెర్రీక్రంచర్ తలతిప్పి చూసాడు. అక్కడ నిలబడి ఉన్నదెవరో కాదు!— సిడ్నీ కార్టన్! అతడ్ని చూసిన మిస్‌ప్రాస్ ఎంతో ఆశ్చర్యపోయింది.

"మీ తమ్ముడి విషయంలో నీకు సంతోషం కలిగించని మరొక విషయం చెబుతాను. మిస్ ప్రాస్! అదేమంటే ఇతడు ప్రస్తుతం జైలు గూఢచారిగా పని చేస్తున్నాడు." అంటూ కార్టన్ జాన్‌బర్సడ్ దిక్కు తిరిగి "కొద్దిరోజుల క్రితం నువ్వు జైలు నుండి ఇవతలికి వస్తుండగా చూసాను. నా స్నేహితుడు ఛార్లెస్ కేసులో నువ్వు ఇరుక్కున్న సంగతి నాకు తెలుసు. అప్పుడు నువ్వు బ్రాందీషాపుకు వెళ్ళావు. నీ స్నేహితులతో అక్కడ ఏం మాట్లాడేవో అవన్నీ నీ వెనుకకూర్చుని ఆలకించాను. ఆనాటి నుంచీ నేను నీ వెన్నంటి తిరుగుతున్నాను. ఎందుకంటే నువ్వు మాకు బాగా ఉపయోగపడే వ్యక్తివి కనుక!" అన్నాడు.

దానితో జాన్‌బర్సడ్ ముఖం పాలిపోయింది.

"నేను మీకు ఉపయోగపడేదేమిటి?" అన్నాడు.

"రహస్య విషయాలు వీధిలో మాట్లాడుకోవడం మంచిది కాదు. మనం కలిసి వెళదాం. మీ సోదరిని ఇంటివద్ద విడిచిపెట్టి మిస్టర్ లారీ ఉంటున్న ఆఫీసుకు వెళదాం. మనతో బాటు జెర్రీక్రంచర్ కూడా వస్తాడు." అన్నాడు కార్టన్.

మిస్ ప్రాస్‌ని ఇంటివద్ద విడిచిపెట్టి ముగ్గురూ బ్యాంక్ ఆఫీసుకు వెళ్ళారు. ఆఫీసులో మిస్టర్ లారీ ఉన్నాడు. ఛార్లెస్ డార్నే తిరిగి అరెస్టు అయిన విషయం మిస్టర్ లారీతో చెప్పాడు కార్టన్!

“అసంభవం! ఇందాకనే కదా. నేను వాళ్ళ ఇంటివద్ద నుండి వచ్చింది. ఛార్లెస్ ఇంటిలోనే ఉన్నాడు కదా!” అన్నాడు మిస్టర్ లారీ ఆశ్చర్యపోతూ.

జాన్‌బర్సడ్ ఎవరో మిస్టర్ లారీకి వివరించి చెప్పాడు కార్టన్. ఛార్లెస్‌ను అరెస్ట్ చేసి తీసుకువెళ్ళిన విషయాన్ని కూడా చెప్పాడు.



జాన్‌బర్సడ్ జీవిత రహస్యాలు తెలిసిన సిడ్నీ కార్టన్ అతన్ని బెదిరించుట!

“నేను భయపడేదేమిటంటే అంతటి పలుకుబడి గల డాక్టర్ మేనెట్ కూడా ఛార్లెస్ అరెస్ట్‌ను నిరోధించలేకపోయాడు. కనుక రేపు ఉదయాన్నే చార్లెస్ మీద న్యాయస్థానంలో మళ్ళీ విచారణ జరుగుతుంది. ఈ విషయంలో ఎవరో ఒకరు మనకు

సహాయం చేయక తప్పదు. ఎవరో ఎందుకు? జాన్‌బర్సడ్ మనకు సహాయం చేస్తాడు." అన్నాడు కార్టన్.

"ఈ విషయంలో మీరు నన్ను బలవంతం చేయలేరు." పిచ్చిగా అరిచాడు జాన్‌బర్సడ్.

"అలా చెబితే ఎలా మిస్టర్ బర్సడ్! కొద్దిగా ఆలోచించు! ఒకప్పుడు నువ్వు ఇంగ్లండ్ తరపున పనిచేసావు. ఇప్పుడు ఫ్రాన్స్ కోసం గూఢచారి వ్యవహారాలు నడుపుతున్నావు. పైకి ఫ్రాన్స్ కోసం పనిచేస్తున్నట్టు నమ్మించినా ఇప్పటికీ ఇంగ్లండ్ తరపునే గూఢచారి చర్యలు జరుపుతున్నావని నా అనుమానం. ఎందుకంటే ఈ రెండు రాజ్యాలలోనూ వివిధ పేర్లతో నువ్వు వ్యవహరించిన ఉదంతమే అందుకు తార్కాణం. నేనా విషయాన్ని విప్లవ కమిటీ ముందు నిరూపించగలను! ఏమంటావ్?"

జాన్‌బర్సడ్‌కి తప్పించుకునే అవకాశం లేకపోయింది. వాళ్ళు చెప్పింది చేయకపోతే తన ప్రాణానికే ముప్పు ఏర్పడుతుందని తెలుసుకున్నాడు.

"ఏం కావాలి మీకు? నేను కేవలం లాఫోర్స్ జైలులో ఒక గార్డుని మాత్రమే!" అన్నాడు జాన్‌బర్సడ్.

"ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు నీవు జైలులోకి వెళ్ళగలవు.... రాగలవు! నీకా అధికారం ఉంది. అవునా?"

"అవును. ఉంది!"

"అయితే మనమిద్దరం రహస్యంగా మాట్లాడుకుందాం!" అంటూ సిడ్నీ కార్టన్, జాన్‌బర్సడ్‌ని తీసుకుని వేరొక గదిలోకి వెళ్ళాడు.

కొంతసేపు వాళ్ళిద్దరూ రహస్య సమాలోచనలు జరిపిన తర్వాత జాన్ బర్సడ్ గది వెలుపలికి వచ్చి తన దారిన వెళ్ళిపోయాడు.

"ఏమిటి మీ ఆలోచనలు? ఏదైనా పథకం ఆలోచించారా?" కార్టన్‌ని అడిగాడు మిస్టర్ లారీ.

"జాన్‌బర్సడ్ సహాయంతో చార్లెస్‌ని అతడి జైలు గదిలో కలుసుకుంటేనే కానీ ఏ విషయమూ చెప్పలేను."

"అలా కలుసుకున్నందువల్ల ఎటువంటి ప్రయోజనమూ ఉండదు. అది ఛార్లెస్ ప్రాణాలు కాపాడలేదు" అన్నాడు మిస్టర్ లారీ ఆవేశంగా.

"నాకు తెలుసు!....అయితే నా మనసులో ఒక ఆలోచన ఉంది. అదేమిటని

నన్ను ప్రశ్నించవద్దు. మీరు లూసీని చూడటానికి వెళ్తూ ఉంటారు కదా!.... ఆమెను ఓదార్చండి. ఛార్లెస్‌కు ఎటువంటి ఆపదా రాదని ధైర్యం చెప్పండి. నేను పారిస్‌లో ఉన్నట్టు ఆమెవద్ద ప్రస్తావించకండి. నా జీవితంలో చాలా భాగం నిరర్థకంగా విలువ లేకుండానే గడిచిపోయింది. నేను ఎప్పుడూ ఎవరికీ ఎటువంటి మంచినీ చేయలేదు. ఇప్పుడు నాకా అవకాశం వచ్చింది." సిడ్నీ కార్టన్ తలెత్తి మిస్టర్ లారీ వంక చూసాడు.

మిస్టర్ లారీకి అతడు మాట్లాడుతున్నదేమిటో అర్థం కాలేదు.

కార్టన్ పైకి లేచి "మనం రేపు ఉదయాన్నే న్యాయస్థానంలో కలుసుకుందాం" అని చెప్పి బ్యాంక్ నుంచి వెలుపలికి వచ్చాడు. దారి వెంట నడుస్తూ ఓ మెడికల్ షాపు వద్దకొచ్చాడు. అక్కడ ఏవో మందులు కొన్నాడు.

"జాగ్రత్త! ఇవి చాలా శక్తివంతమైన మందులు!" అని మందుల షాపు యజమాని చెప్పాడు.

తెల్లవారే వరకు ఏం చేయాలో కార్టన్‌కు తోచలేదు. రాత్రంతా పారిస్ వీధులగుండా తిరిగాడు.

తెల్లవారింది!....ఉదయాన్నే మామూలుగా తీసుకునే బ్రాందీకి బదులు, రొట్టె, కాఫీ సేవించాడు. ఆ తర్వాత, తిన్నగా కోర్టుకు వెళ్లాడు! ఆరోజు చార్లెస్ కేసు విచారణకు వస్తుంది!—

విచారణ ప్రారంభమైంది!

"డార్నే అని పిలువబడే చార్లెస్ ఎవర్మాండే!.... నిన్న నీవు విడుదల చేయబడి తిరిగి అరెస్టు కావింపబడ్డావు. దానికి కారణం నీవు రిపబ్లిక్ ప్రభుత్వానికి వ్యతిరేకివనీ ప్రజా ఉద్యమానికి శత్రువువనీ. నీవొక ఉన్నత వంశానికి చెందిన ధనిక కుటుంబానికి చెందిన వాడివనీ, మీ వంశంవారు పేదలను హింసించారనీ అతి దారుణంగా అణగ ద్రొక్కారనీ కనుక నీవు దేశ ద్రోహివనీ, నీకు వ్యతిరేకంగా చెబుతున్నారు—" అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"ఇతడికి వ్యతిరేకంగా మాట్లాడుతున్న వారెవరు?" అధ్యక్షుడు ప్రాసిక్యూటర్ని ప్రశ్నించాడు.

"ముగ్గురు వ్యక్తులున్నారు!— ఒకరు ఎర్నెస్ట్ డిఫార్గ్. ఇతను సెయింట్ ఆంథోనీ ప్రాంతంలో వున్న బ్రాందీ షాపు యజమాని. రెండవవారు ఎర్నెస్ట్ డిఫార్గ్ సతీమణి థెరెసా డిఫార్గ్!....మూడవ వ్యక్తి అలెగ్జాండర్ మేనెట్.... ఇతను

పేరు పొందిన డాక్టర్!....” అన్నాడు ప్రాసిక్యూటర్.

చార్లెస్‌కు వ్యతిరేకినని ప్రాసిక్యూటర్ చెప్పగానే డాక్టర్ మేనెటు ముఖం కత్తివేటుకు నెత్తురుచుక్క లేనంతగా పాలిపోయింది. అతడు వణుకుతూ లేచి నిలుచున్నాడు.

ఎర్నెస్ట్ డిఫార్జ్ సాక్షిగా బోనులోకి పిలిపించబడ్డాడు.

తాను వయసులో ఉన్నప్పుడు డాక్టర్ మేనెటువద్ద సేవకుడిగా పనిచేసిన విషయమూ డాక్టర్ మేనెటు పద్దెనిమిది సంవత్సరాల జైలు జీవితమూ ఆ తర్వాత విడుదలైన సంగతీ అన్నీ కోర్టువారికి వివరించి చెప్పాడు డిఫార్జ్.

“మేము బాస్టిల్లీ జైలును స్వాధీనం చేసుకున్న తర్వాత డాక్టర్ మేనెటు వున్న 105 నెంబరు గదిని తనిఖీ చేసాను. నాకు అక్కడ చిమ్నిలోని ఒక రాతి పలక లోపల డాక్టర్ మేనెటు రాసిన కాగితమొకటి దొరికింది. దానిని కోర్టువారికి సమర్పిస్తున్నాను. చూడగలరు” అంటూ డిఫార్జ్ ఓ కాగితాన్ని కోర్టువారికి సమర్పించాడు.

ఆ కాగితాన్ని న్యాయస్థానంలోని ఒక వ్యక్తి అందరికీ వినిపించేలా యిలా చదివాడు :

“నాపేరు అలెగ్జాండర్ మేనెటు. నేనొక దుఃఖితుడనైన ఖైదీని. నేనీ కాగితాన్ని బేస్టిల్లీ జైలులోని నా గదిలో 1767వ సంవత్సరంలో రాస్తున్నాను. నేను పరిపూర్ణ ఆరోగ్యంతో, మనస్థిమితం సరిగ్గా ఉన్నప్పుడే దీనిని రాస్తున్నాను.

1757 సంవత్సరంలో ఒకనాటి రాత్రి నడుచుకుంటూ పారిస్‌లోవున్న మా ఇంటికి వస్తున్నాను. అంతలో ఒక గుర్రపుబండి వచ్చి నా ముందు ఆగింది. దానినుండి ఇద్దరు వ్యక్తులు దిగారు. వాళ్ళు కవల సోదరులవలె వున్నారు. ఇద్దరి వద్దా ఆయుధాలు వున్నాయి. నన్ను బండి ఎక్కమన్నారు. నేను మాట్లాడకుండా బండి ఎక్కాను. బండి బయలుదేరింది. ఊరి చివరగావున్న ఏకాంత ప్రదేశంలో ఆగింది. అక్కడొక ఇల్లు ఉంది. వాళ్ళు నన్ను ఇంటి లోపలికి తీసుకు వెళ్ళారు. అక్కడొక యువతి మంచంమీద పడి వున్నది. ఆమె మంచానికి కట్టబడి వుంది. ఆమె బిగ్గరగా అరుస్తున్నది.

“నా భర్త....నా తండ్రి....నా సోదరుడు....హుష్” అంటున్నది. ఆమె ఒక మానసికరోగి అని తెలుసుకున్నాను. కానీ నా వెంట మందుల సంచి తీసుకు వెళ్ళలేదు. ఆ సోదరులే ఏవో మందులు యిచ్చారు.

"వేరొక గదిలో యింకొక రోగి ఉన్నాడు" సోదరులలో చిన్నవాడు చెప్పాడు.

ఆ గదిలోకి వెళ్ళి ఆ రోగిని చూశాను. అతడికి పదిహేడు సంవత్సరాలు ఉంటాయి. అతడి ఛాతీమీద కత్తిగాయం లోతుగా వుంది. అతడు బాధతో మూలుగు



డాక్టర్ మేనెట్‌ని తీసుకొచ్చి తాము చెరబట్టిన యువతిని అతడికి మార్కిస్ సోదరులు చూపించుట.

తున్నాడు.

"ఇదెలా జరిగింది?" అని సోదరులలో ఒకడిని అడిగాను.

"ఒక మామూలు వీధికుక్క నా తమ్ముడ్ని కరువబోయింది. చేసేదిలేక

అతడు కత్తిని కుక్కమీద ఉపయోగించక తప్పలేదు" అన్నాడు సోదరులలో ఒకడు.

చావు బ్రతుకుల్లోవున్న కుర్రవాడు శక్తినంతా కూడదీసుకుని "మా వంటి పేదవారిని చంపే హక్కు తమకు ఉందని, మదమెక్కిన యీ కులీన ధనవంతులు భావిస్తున్నారు. మా అక్కను చూసారా డాక్టర్! ఆమెకు ఎలా వుంది?" అని అడిగాడు.

"మీ అక్కను చూసాను!" అని కుర్రవాడితో చెప్పాను.

ఆ కుర్రవాడు బాధతో మూలుగుతూ యిలా చెప్పాడు :

"మా అక్క చాలామంచిది డాక్టర్! ఆమె వివాహం ఒక యువకుడితో నిశ్చయమైంది. మేము అందరం ఈ సోదరులకు సంబంధించిన పొలాలను పండించే కౌలుదారులం! అందువలన వీళ్ళు మమ్మల్ని బానిసలకంటే హీనంగా చూసేవారు. మా స్త్రీలను వీళ్ళు తమ విలాస వస్తువులుగా వాడుకునేవారు. వాళ్ళ జీవితాలతో ఆడుకునేవారు.

కొన్నాళ్ళకు మా అక్క వివాహమైంది. ఈ సోదరులలో చిన్నవాడు ఒక నాడు మా అక్కను చూసాడు. మోహావేశంలో ఆమెను వాంఛించాడు. ఆమెను తనకు అప్పగించమని ఆమె భర్తను అడిగాడు. అతను అంగీకరించలేదు. ఎదురు తిరిగాడు. అందుకు శిక్షగా యితడు నా అక్క భర్తను జంతువులాగ బండికి కట్టి రాళ్ళ మీద యీడ్పించాడు. ఒక రాత్రి ఒక పగలు తిండీ తిప్పలూ లేకుండా అలాగే ఉంచాడు. చివరకు అతడు మా అక్క చేతుల్లోనే మరణించాడు.

తన అన్న అనుమతితో యితడు మా అక్కను ఎత్తుకుపోయి వేరొకచోట దాచాడు. ఈ విషయం నా తండ్రితో చెప్పాను. అతను కోపావేశంతో సోదరులు ఉంటున్న కోటకు వెళ్ళాడు. ఆ తర్వాత నా తండ్రి తిరిగి రాలేదు. నాకొక చిన్న చెల్లెలు ఉంది. ఆమెను దూరప్రాంతంలో ఉన్న మా బంధువుల ఇంటికి పంపేసాను.

ఒకనాడు యీ రెండవ సోదరుడు బండిలో వెళుతుండటం చూసాను. కోపం ఆపుకోలేకపోయాను. ఖడ్గం చేత ధరించి బండిని అనుసరించాను. చివరకు బండి ఊరి వెలుపల ఉన్న ఓ ఇంటిముందు ఆగింది. ఇతడు బండి దిగి లోనికి వెళ్ళాడు. నేను కిటికీ గుండా లోనికి అడుగుపెట్టాను. మా అక్క నన్ను చూసింది. పరుగు పరుగున వచ్చి మా ఇద్దరి మధ్యా అడ్డుగా నిలిచింది.

'ఎవరో ఒకరు మృత్యువాత పడేవరకు మధ్యకు రావద్దు' అని మా అక్కను

హెచ్చరించాను.

మా ఇద్దరికీ జరిగిన కత్తి యుద్ధంలో ఇతడు మోసంతో నా గుండెల్లో పొడిచాడు.

డాక్టర్! వీళ్ళు నరరూప రాక్షసులు! ఏదో ఒకనాడు వీరు చేస్తున్న ఘోర కృత్యాలకు భగవంతుని ముందు జవాబు చెప్పక తప్పదు."

ఆ కుర్రవాడిలో శక్తి నశించింది. ఊపిరి ఆగిపోయింది. అతడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

ఆ తర్వాత కుర్రవాడి అక్క కూడా నా కళ్ళముందే చనిపోయింది.

నేను ఆ మర్నాడు ఇంటికి చేరుకున్నాను. రాత్రి జరిగిన సంఘటనలు నన్ను ఉద్రేకపూరితుడ్ని చేసాయి.

ఆ విషయాలన్నీ తెలియజేస్తూ మంత్రిగారికి ఒక లేఖ రాసాను.

లేఖ పూర్తి అవుతూనే ఒక యువతి నా గదిలోకి వచ్చింది. ఆమె వెంట మూడేళ్ళ కుర్రవాడు ఉన్నాడు.

ఆమె తన్ను తాను పరిచయం చేసుకుంటూ "చూడండి డాక్టర్! నేను మార్కుస్ ఎవర్‌మాండే భార్యను. నా భర్త అతని సోదరుడు చేసిన ఘోరకృత్యం గురించి తెలుసుకున్నాను. మీరు వాళ్ళను చూసేందుకు వెళ్ళిన విషయం కూడా తెలిసింది. ఆ అమ్మాయి ఎక్కడ ఉంది డాక్టర్?.... వాళ్ళు ఎవరో మీకు తెలుసా? తెలిస్తే చెప్పండి ఆ పేదవాళ్ళకు న్యాయం చేస్తాను. ధన సహాయం చేస్తాను." అంది.

ఆ బాధితులు ఎవరో నాకు తెలియదనీ, కనీసం వాళ్ళ పేర్లు కూడా నాకు తెలియదని ఆమెతో చెప్పాను.

"చూడండి డాక్టర్! ఈనా చిన్నారి కుమారుడి మీద ఈనా చార్లెస్ మీద ఇతడి తండ్రి క్రూరత్వాన్ని, ఆ ఛాయలను పడనీయను. ఇతని తండ్రి చేసిన ఘోర పాపకృత్యాల ఫలితం నా కుమారుడు అనుభవించకూడదు." అని చెప్పి ఆమె తన మూడేళ్ళ కొడుకు చార్లెస్‌ను తీసుకుని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన తర్వాత లేఖను మంత్రిగారికి పంపించాను.

ఆ రాత్రి నా సేవకుడైన ఎర్నెస్ట్ డిఫార్జ్ నా వద్దకొచ్చి 'మీ కోసం ఎవరో వచ్చార'ని చెప్పాడు. నేను వెళ్ళి చూసాను. ద్వారం వద్ద ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. 'మెడికల్ ఎమర్జెన్సీ డాక్టర్! మీరు త్వరగా రావాలి!' అని చెప్పాడు.

అతడితో నేను బండిలో బయలుదేరాను. కొంతదూరం వెళ్ళిన తర్వాత ఒకచోట బండి ఆగింది. బండిలో వున్న వ్యక్తి వెనుకపాటున నా నోటికి గుడ్డ కట్టే సాడు. విషయమేమిటో నాకు అర్థంకాలేదు.



మార్కుస్ ఎవర్మాండే ఆ యువతి తమ్ముడితో కత్తి యుద్ధానికి సిద్ధపడుట.

అప్పుడు ఆ ఇద్దరు మార్కుస్ ఎవర్మాండే సోదరులు చీకటిలో నుండి వెలుగులోకి వచ్చారు. అందులో ఒకడు తన జేబులో నుండి, నేను మంత్రిగారికి

రాసిన లేఖను యువతలికి తీసాడు.

"ఇదేకదూ నువ్వు మంత్రిగారికి రాసిన లేఖ!" అంటూ దానిని కాల్చి నుసి చేసాడు.

ఆ తర్వాత నేను బాస్టిల్లి జైలులోని నార్త్‌టవర్, 105 నెంబరు గదికి తీసుకురాబడ్డాను. ఇది నాకు సమాధి గొయ్యి వంటిదే!—

"నేను అలెగ్జాండర్ మేనెట్‌ని! నికాశతో కుమిలిపోతున్న ఖైదీని! నా భార్య బ్రతికిఉందో లేదో నాకు తెలియదు. ఇది 1767వ సంవత్సరం! ఇన్ని ఘోర పాపాలు చేసినందుకు ఎవర్‌మాండే వంశంలోని ఆఖరి వంశాంకురం వరకు, ఆ పాప ఫలితాన్ని అనుభవించి తీరాలి....తప్పదు."

డాక్టర్ మేనెటు చివరి వాక్యాలను పరిగణనలోకి తీసుకుంటూ అధ్యక్షుడు ఛార్లెస్‌కు మరణ దండన విధించాడు. న్యాయస్థానంలో కూర్చున్న ప్రజలలో, ఛార్లెస్ మీద సానుభూతి కనిపించలేదు. వాళ్ళంతా మౌనముద్ర వహించారు.

"ఇరవై నాలుగు గంటలలో, ఛార్లెస్‌ను మృత్యుయంత్రంద్వారా తల నరికి చంపవలసింది!" అని అధ్యక్షుడు చెప్పిన తీర్పు డాక్టర్ మేనెటు చెవుల్లో గింగురు మంటూనే ఉంది.

అతడికి కన్నీరు ఆగలేదు!—

## 14

డాక్టర్ మేనెటులో ఇంకా ఆశ చావలేదు. ఇంకా తన పలుకుబడి ఉపయోగించి ఛార్లెస్‌ను కాపాడుకోవాలని, న్యాయస్థానం చుట్టూ తిరగడం ప్రారంభించాడు.

మిసెస్ లూసీ దుఃఖానికి అంతులేదు. ఆమె ఇంటిలోనే శోకదేవతవలె పడి ఉంది.

సిడ్నీ కార్టన్‌కు సెయింటు ఆంథోనీలో గల బ్రాందీ షాపుకు వెళ్ళాలనిపించి అక్కడికి వెళ్ళాడు. మద్యం బాగా సేవించిన వాడిలా తూలుతూ, వచ్చీరాని ఫ్రెంచి భాషను ముద్దుగా మాట్లాడుతూ, కౌంటర్ దగ్గరగా ఓ బల్ల మీద కూర్చున్నాడు.

మేడమ్ డిఫార్గ్ కార్టన్‌ని చూసింది. అతడు అచ్చుమచ్చు చార్లెస్‌లాగే ఉండటం చూసి ఆ విషయాన్ని భర్తతో చెప్పింది.

మేడమ్ డిఫార్గ్, ఎర్నెస్ట్ డిఫార్గ్, జాక్విస్ మూడు, విగ్గరగానే మాట్లాడుకో సాగారు. తప్పతాగినట్లు కనిపిస్తున్న కార్టన్ గురించి వారు అంతగా పట్టించు కోలేదు.

"చట్ట ప్రకారం శిక్ష అమలు జరపడం న్యాయమే. అయినా డాక్టర్ మేనెటు యిప్పటికే ఎన్నో బాధలు అనుభవించాడు. చార్లెస్‌కు విధించిన మరణ దండనను డాక్టర్ తట్టుకోలేకపోతున్నాడు" అన్నాడు డిఫార్గు జాలిగా.

"ఇందులో నువ్వు జాలిపడవలసింది ఏదీలేదు. మరణశిక్ష అనుభవించే, ఎవర్‌మాండే నేరస్థుల పేర్లను నేను ఏనాడో నా లేసు అల్లికలో లిఖించాను. డాక్టర్ మేనెటు రాసిన కాగితం చూసిన తర్వాత, నా కక్ష ద్విగుణీకృతమైంది. ఎవర్‌మాండే సోదరులచేత చంపబడినవారు ఎవరో కాదు, నా వాళ్ళు. నా రక్త సంబంధీకులు!.... నా అక్క, నా బావ, నా అన్న, మా నాన్న.... ఆ కుటుంబంలో మిగిలివున్న దానిని నేనొక్కతెనే!— ఎవర్‌మాండే కుటుంబంలోని వారు అందరూ చావవలసిందే!....చార్లెస్‌తోబాటు అతడి భార్య, కూతురూ కూడా చావవలసిందే!" అంది మేడమ్ డిఫార్గు.

అంతలో కొంతమంది షాపులో అడుగుపెట్టారు. వాళ్ళ సంభాషణ ఆగి పోయింది. తను ముఖ్యమైన విషయాలు ఆలకించాడు కనుక అక్కడ ఉండటం అనవసరమనిపించి, కార్టన్ లేచి షాపు బయటికి వచ్చేసాడు.

ఆ విషయాలను లూసీకి, మిస్టర్ లారీకి, డాక్టర్ మేనెట్‌కి తెలియజేయడం మంచిదనుకున్న కార్టన్ తిన్నగా బ్యాంక్‌కి వచ్చాడు.

అర్థరాత్రి దాటిన తర్వాతగానీ డాక్టర్ అక్కడికి రాలేదు. అయితే డాక్టర్‌కి మనస్థిమితంలేదు. పిచ్చిచూపులు చూడసాగేడు. ఏమైనా మందులు ఉంటా యేమోనని కార్టన్ డాక్టర్ కోటు జేబులు వెదికాడు. అతడికి ఒక జేబులో చిన్న పెట్టె కనిపించింది. దానిని తెరిచి చూడగా కార్టన్‌కి మడతపెట్టిన కాగిత మొకటి దొరికింది.

దానిని విప్పి చూస్తూనే కార్టన్ సంతోషంగా కేకపెట్టి "భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పవలసిందే!" అన్నాడు.

తన జేబులో నుండి ఒక కాగితాన్ని తీసి, ఆ రెండింటినీ మిస్టర్ లారీ చేతికిచ్చాడు.

"చూడండి! ఈ సర్టిఫికేట్లతో, డాక్టర్ మేనెటు, మిసెస్ లూసీ, ఆమె కుమార్తె, నేనూ క్షేమంగా పారిస్‌ను విడిచిపెట్టి అవతలికి వెళ్ళగలం! మీరు నా కోసం వీటిని రేపటి ఉదయం వరకూ జాగ్రతగా ఉంచండి" అన్నాడు కార్టన్, మిస్టర్ లారీతో.

"ఎందుకు? వీళ్ళు అపాయంలో ఉన్నారా?"

"మహా ప్రమాదంలో ఉన్నారు! మనం ఒక్కక్షణం కూడా వృథా చేయ కూడదు మిస్టర్ లారీ! ఎలాగైనాసరే, నువ్వు వీళ్ళను రక్షించాలి!" అన్నాడు కార్టన్ ఆతృతగా.

"ఏ విధంగా?" మిస్టర్ లారీ ప్రశ్నించాడు.

"రేపు మధ్యాహ్నం రెండు గంటలకు పారిస్ నుండి బయలుదేరే విధంగా ఒక కోచ్ బండిని ఏర్పాటు చేయాలి. అందులో నాకూ, నీకూ, డాక్టర్ మేనెటుకీ మిసెస్ లూసీకి ఆమె కుమార్తెకూ సీట్లు రిజర్వ్ చేయించు! నేను బండి దగ్గరకు వచ్చిన మరుక్షణం నన్ను లోపలకు చేర్చి బండిని పోనివ్వాలి. కాగితాలను, సర్టిఫి

కేట్లను నీ వద్దనే జాగ్రత్తగా ఉంచు. ఏది జరిగినా సరే యీ పథకాన్ని మాత్రం మార్చవద్దు. తెలిసిందా?"

దానికి మిస్టర్ లారీ అంగీకరించాడు!



సిడ్నీ కార్టన్ చార్లెస్‌కి మత్తు మందు వాసన చూపెంచి స్పృహ పోగొట్టుట!

మిస్టర్ కార్టన్, డాక్టర్ మేనెటుని తీసుకుని అతడి ఇంటి దగ్గరకు వచ్చాడు. డాక్టర్ నెమ్మదిగా, ఇంటి లోపలికి వెళ్లాడు. తనని ఎవరు తీసుకు వచ్చారో తెలుసుకునే స్థితిలో లేడు అతను.

కార్టన్ వీధిలోనే నిలబడిపోయాడు. తలెత్తి లూసీ గదివంక చూసాడు. గదిలో దీపం వెలుగుతున్నది.

"నీకు శుభాకాంక్షలు, నా ప్రియమైన లూసీ!....తుది వీడ్కోలు అందుకో!" అన్నాడు కార్టన్ గాలిలో చేతులు ఊపుతూ.

## 15

చార్లెస్ డార్నే తన గదిలో కూర్చుని తన వారికి తుది వీడ్కోలు లేఖలు రాయడం ప్రారంభించాడు. ఆ మధ్యాహ్నం మూడు గంటలకు అతడి మరణశిక్ష అమలు జరుపబడుతుంది.

అప్పుడు సరిగ్గా రెండు గంటలైంది. మరొక గంటకల్లా అతడికి ఈ లోకంతో ఋణం తీరిపోతుంది.

అంతలో అతడి గది తలుపులు తెరుచుకున్నాయి. సిడ్నీ కార్టన్ లోనికి అడుగు పెట్టడం చార్లెస్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. కార్టన్ తలుపులు మూసి చార్లెస్ వద్దకొచ్చాడు.

"చూడు చార్లెస్! సమయంలేదు. నేను నీ భార్య వద్దనుండి వస్తున్నాను. నేను చెప్పినట్టు చేయడమే నీ తక్షణ కర్తవ్యం. నీ బూట్లు, నెక్ టై, బట్టలు, తలకు కట్టిన రిబ్బను అన్నీ విప్పేసెయ్!.... నా బట్టలు నువ్వు వేసుకో! మనమిద్దరం ఒకే పోలికలో ఉంటామని నీకు తెలుసు. నాలాగ నీ వెంట్రుకలను చిందర వందర చేసుకో!" అన్నాడు కార్టన్.

"మిస్టర్ కార్టన్! ఇది కేవలం పిచ్చితనం!....మృత్యు కుహరంవంటి యీ స్థలంనుండి ఎవరూ తప్పించుకుని బయటికి వెళ్ళలేరు. నాతోబాటు నువ్వు కూడా దేనికి మరణిస్తావు?" అన్నాడు చార్లెస్.

"నేను నిన్ను తప్పించుకు వెళ్ళమని చెప్పలేదే! కూర్చుని నేను చెప్పినట్టు ఓ ఉత్తరం రాయి" అన్నాడు కార్టన్.

చార్లెస్ కూర్చున్నాడు. కార్టన్ అతడి వెనుకభాగంలో నిలబడి జేబులో నుండి మందులషాపులో కొన్న మత్తుమందును తీసి చార్లెస్ ముక్కువద్ద ఉంచాడు. మరుక్షణంలో చార్లెస్ స్పృహతప్పి నేలమీద పడిపోయాడు.

కార్టన్ నెమ్మదిగా చార్లెస్ బట్టలుతీసి తన బట్టలు అతడికి తొడిగాడు. చార్లెస్ బట్టలు తను వేసుకున్నాడు. చార్లెస్ కట్టుకొన్న రిబ్బను తన తలకు కట్టుకొన్నాడు. ముమ్మూర్తులా చార్లెస్‌లా తయారయ్యాడు.

అన్నీ సక్రమంగా ఉన్నాయని నిర్ధారణ చేసుకొన్న తర్వాత బైట వేచి వున్న గార్డును లోనికి పిలిచాడు.

అక్కడ గార్డుగా పనిచేస్తున్న జైలు గూఢచారి అయిన జాన్‌బర్సడ్ లోనికి వచ్చాడు.

"నన్ను చూడటానికి వచ్చిన నా స్నేహితుడు మూర్ఛపోయాడు. బయటికి తీసుకువెళ్ళు" అన్నాడు కార్టన్.

జాన్‌బర్సడ్ చార్లెస్ కుడిచేతిని తన భుజంమీద వేసుకొని గది వెలుపలికి తీసుకొచ్చాడు.

"చూడు మిస్టర్ బర్సడ్! కోర్టు ఆవరణవద్ద ఒక ప్రయాణీకుల కోచ్ బండి వుంటుంది. అందులో మిస్టర్ లారీ ఉంటాడు. ఇతడ్ని మిస్టర్ లారీకి అప్పగించు" అని చెప్పాడు కార్టన్.

జాన్ బర్సడ్ అలాగే చేసాడు—

మధ్యాహ్నం మూడు గంటలలోపు కోచ్ బండి పారిస్ నగరాన్ని విడిచి బయలుదేరింది. సిటీగేటువద్ద చెకింగ్ కోసం కోచ్ బండిని ఆపుచేసారు.

"మీ పేపర్స్ చూపించండి" అన్నాడు గార్డు.

మిస్టర్ లారీ పేపర్లు గార్డుకి యిచ్చాడు. డాక్టర్ మేనెట్, మిసెస్, లూసీ, ఆమె కూతురూ, మిస్టర్ లారీ, సిడ్నీ కార్టన్ పేపర్లు సక్రమంగా ఉన్నట్టు గార్డు ఆమోద ముద్ర వేశాడు. సిడ్నీకార్టన్ పేరుతో చార్లెస్ డార్నే ఆ కోచ్ బండిలో తప్పించుకు వెళుతున్న విషయం ఎవ్వరికీ తెలియదు.

కోచ్ బండి వేగంగా పారిస్ నగరాన్ని విడిచిపెట్టి లండన్ నగరాభిముఖంగా బయలుదేరింది.

## 16

మేడమ్ డిఫార్గు బ్రాందీషాపులో కూర్చుని వున్నది. ఆమెవద్ద జాక్విస్ మూడు మాట్లాడుతూ నిలబడి ఉన్నాడు.

అప్పటికి మధ్యాహ్నం రెండు కావస్తున్నది.

"ఇంకా ఇద్దరు దేశద్రోహులు అక్కడ వున్నారు. ఒకరు చార్లెస్ ఎవర్మాండే భార్య లూసీ! రెండవది దాని కూతురు. నేను వెళ్ళి వాళ్ళ వ్యవహారమేదో

చూసి అటునుండి జైలువద్దకు వస్తాను. నా కుర్చీ మృత్యు యంత్రం దగ్గరగా వేసి వుంచు" అని మేడమ్ డిఫార్గు చెప్పింది జాక్విస్‌మూడుతో.

అతడు వెళ్ళిపోయాడు.



చార్లెస్ స్థానంలో సిడ్నీ కార్టన్, మృత్యు యంత్రానికి బలైపోవుట.

మేడమ్ డిఫార్గు తన కుర్చీలోంచి లేచింది. ఆమెలో ప్రతీకార జ్వాలలు చెలరేగుతున్నాయి. ఛార్లెస్ ఎవర్‌మాండే సోదరులు చంపిన రక్తసంబంధీకు లందరూ ఆమె కళ్ళముందు కదులుతున్నారు.

మేడమ్ డిఫార్గులో కక్షతో కూడిన ఉద్రేకం ఉప్పొంగుతోంది. శరీరంలో రక్తం పొంగిపోతోంది. టేబుల్ సొరుగులో నుంచి పిస్టల్ తీసుకుంది. పిడి బాకును కూడా మొలకు పెట్టుకున్న బెల్టులో దాచుకుంది.

బ్రాందీ షాపులోంచి బయటపడి రోడ్డు మీదకు వచ్చింది. ట్రాఫిక్ రద్దీగా ఉంది. అటుగా వస్తున్న టాక్సీని ఆపింది. లోపల కూర్చుని వెళ్ళవలసిన చోటు చెప్పింది.

అరగంటలో టాక్సీ ఒక ఇంటిముందు ఆగింది. మేడమ్ డిఫార్గు టాక్సీ లోంచి దిగి, బిల్ చెల్లించి టాక్సీని పంపించి....తిన్నగా ఆ ఇంటి వీధితలుపుల దగ్గరకు వెళ్ళింది. కాలింగ్ బెల్ స్విచ్ నొక్కింది.

రెండు నిమిషాల్లో తలుపులు తెరుచుకున్నాయి. మెరుపు వేగంతో లోపలికి వెళ్ళి వెంటనే తలుపులు మూసేసింది.

స్థాణువులా నిలబడిపోయింది చార్లెస్ ఎవర్మాండే కూతురు మిస్ ప్రాస్. మేడమ్ డిఫార్గు ఎందుకు వచ్చిందో ఆమెకు తెలుసు. ఆమె ముఖంలో నెత్తురు చుక్క లేదు. భయంతో కనుగుడ్లు ముందుకు పొడుచుకొచ్చాయి. పెదాలు విడివడ్డాయి.

మేడమ్ డిఫార్గు చేతిలోని పిస్టల్ మిస్ ప్రాస్ గుండెలకు గురిపెట్టింది. "దేశద్రోహి" అని ఆమె నోటివెంట మాట రావడంతోపాటు చేతిలోని పిస్టల్ పేలింది. గుండెల్లోంచి రక్తం చిమ్మింది.

ఆ శబ్దానికి మేడమీద నుండి హడావుడిగా మెట్లు దిగి క్రిందికి వచ్చిన చార్లెస్ ఎవర్మాండే భార్య లూసీ— మేడమ్ డిఫార్గును చూడగానే భయంతో కంపించిపోయింది. క్రింద పడున్న కూతుర్ని చూస్తుంటే దుఃఖం పెల్లుబికింది.

పిచ్చెక్కినట్లు మేడమ్ డిఫార్గు మీదికి దూకబోయింది. కానీ అంతలోనే మేడమ్ డిఫార్గు చేతిలోని పిస్టల్ నిప్పులు కక్కింది.

ఆ మరుక్షణం పెద్దగా అరుస్తూ క్రింద పడిపోయింది లూసీ.

మేడమ్ డిఫార్గులో కసి ఆ రెండు చావులతో కొంత చల్లారింది. ఇక మిగిలింది చార్లెస్....అతనికి ఎలాగూ జైలులో శిరచ్ఛేదన తన ప్రమేయం లేకుండానే జరిగిపోతుంది.

ఆ సంఘటన తన కళ్ళతో చూడాలి....అక్కడ నుండి బయలుదేరి జైలుకు వెళ్ళింది. అక్కడ మృత్యుయంత్రం ముందు చార్లెస్ రూపంలోనున్న సిడ్నీ కార్టన్ మోకరిల్లి శిరస్సును చెక్క మీద వుంచాడు.

అక్కడ నించుని వున్న గార్డు కత్తికి కట్టిన తాడును చేతి వాచీలో టైమ్ చూసుకుని వదిలిపెడతాడు. ఆ పదునైన కత్తి సిడ్నీ కార్టన్ శిరస్సును ఖండించి మొండానికి వేరు చేస్తుంది. అది చూసిన మేడమ్ డిఫార్గులో కక్ష తీరింది.... కానీ అతను చార్లెస్సా కాదా అనే సందేహం మాత్రం మనసులో పీకుతూనే వుంది.

—)o(—